# వినాయక సావర్కారు జీవితము.





గ్రంథకర్త:

ముదిగంటి జగ్గన్న శాస్త్రి.

రాజమండ్రి.

ఒకటవకూర్పు 1000 ప్రతులు.

కాకినాడ:

కాకినాడముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1932

 [వెల రు 0—12—0

# పీఠిక. 21-24

జగమెఱిగిన బ్రాహ్మణునకు జందెమేల? వినాయక సావర్కారు నాంధ్రలోకమునకు క్రొత్తగా బరిచయము చేయ నవసరము లేదని యాంధ్రమహాసభలో గావింపబడు చుండిన తీర్మానములే చెప్పక చెప్పుచున్నవి. కాని యతని చరిత్రను తెలిసికొనఁ గుతూహలపడుచున్న యాంధ్రసోదరుల కాంధ్రవాఙ్మయమున నీకొఱత దీర్పనెంచి మే మీపనికి బూనుకొంటిమి. మే మిందు చారిత్రాత్మక విషయములను మాత్రమే స్థాలీపులాకన్యాయముగా క్రోడీకరించి సంగ్రహముగా చర్చించితిమి. ఇందు సావర్కారు తన వదినగారికి విషమపరిస్థితులలో వ్రాసిన రెండుయుత్తరములను, భారతదేశమునకు ఖయిదీగా 1910 వ సంవత్సరమున తీసికొని రాబడునాడు స్నేహితులకు వ్రాసినయుత్తరమును, 1921 లో మృత్యుదేవతతో బోరాడుచు నామె నాహ్వానించిన యాహ్వానము మొదలగునవి చేర్పబడెను. ఇతరవిషయములు 1918 లో ప్రకటింపబడిన రౌలటుకమిటీవారి నివేదిక, బరేంద్రకుమార ఘోషు (అరవిందఘోషుసోదరుడు) వ్రాసిన "నాప్రవాస కథనము" "బారిష్టరు సావర్కారుజీవితము" "అండమాను ప్రతిధ్వని" మొదలగువాటినుండి సేకరింపబడెను.

ముదిగంటి జగ్గన్నశాస్త్రి.

# వినాయక సావర్కారు జీవితము.

## బాల్యము.

మ. అతిగాఢాంధతమోవృతం బిది! సమస్తావకాశంబు మూ
ర్ఛితచైతన్యము! వత్స! సుప్తి గను నిశ్చింతన్ ర...
హ్నితఘోరకరశంఖదుందుభుల ప్రక్షి...
బ్రతుకం గాలము వచ్చునంతవఱకున్ ...
శ్రిత మౌచు న్నిది పౌరుషోదయమునన్ స్వా...

ఏతల్లి ఛత్రపతి శివాజీమహారాజును గాంచెనో, ఏ జనని వీరమాత ఝాన్సీలక్ష్మీబాయిని ప్రసవించెనో, ఏయంబ బాజీరావు, బాలాజీవిశ్వనాథు, నానాఫడ్నవీసు, నానాసాహెబుప్రభృతులను గన్నభాగ్యమును బడయగలిగెనో, ఏమాత తిలకాది పురుషరత్నములకు ఖనియయ్యెనో యట్టి మహారాష్ట్రదేశమున తీర్థరాజమై గౌతమీపుణ్యసలిలముల కావాసమైన నాశికానగరప్రాంతమున భాగూరుగ్రామములో వినాయకసావర్కారు దామోదరపంతుసావర్కారను నొక చిత్పవనబ్రాహ్మణునకు (1883) వ వత్సరమున జనించెను.

ఇతని యన్న గణేశసావర్కారు; ఇతనితమ్ముడు నారాయణ సావర్కారు; ఈముగ్గురును కలసి "సావర్కారుసోదరత్రయ" మని ప్రఖ్యాతిబడసిరి. పుష్పోదయముతో బరిమళము ప్రసరించునట్లు శైశవమునుండియు వినాయకసావర్కారు ప్రతిభాశాలి యగునని పలువురు గ్రహించిరి. ఇతడు దేశభక్తిని, కవిత్వమును, యుదారగుణసంపత్తిని, మహదాశయములను, వీరపురుషోచితధర్మములను, దామోదరపంతుసావర్కారువలన రామాయణ, భారత, భాగవతాది పురాణశ్రవణ, మననములచేతను, శివాజీ, రాణాప్రతాప్, లక్ష్మీబాయి మొదలగు వీరులయొక్కయు, పరమాతలయొక్కయు శౌర్య, బల, పరాక్రమాది సద్గుణసంపత్తిధనములవలనను, తుకారాం, వామన, మోరోపంతు మొదలగు మహారాష్ట్రకవుల కవితారసాస్వాదనముల చేతను సద్గుణాలుగా గొని దశవర్ష ప్రాయముననే గవిత్వమును చెప్పనారంభించెను. మహారాష్ట్రదేశములోని పత్రికలన్నియు నీబాలుడు వ్రాసిన గద్యపద్యవ్యాసముల సంతోషముతో స్వీకరించుచుండెడివి. బాలుడయ్యును సావర్కారు మహాభారతాది గ్రంథముల సారమును, కేసరి మొదలగు పత్రికారాజములమూలమున రాజకీయపరిస్థితులను గ్రహించుచు సామ్రాజ్యాధిపత్యమును వహించిననాటి మహారాష్ట్రవీరుల చరిత్రామృతమును నిరంతరమును గ్రోలుచు, దనతోడిబాలుర నందఱను జేరదీసి వీరరస ముప్పొంగునట్లు

మహారాష్ట్ర, రాజపుత్రస్థాన కథాసరిత్తులలో నోలలాడుచుండెడివాడు. ఆత డాటపాటలలో గూడ వీరక్రీడలనే సలుపుచుండెడివాడు. సావర్కారు జన్మతః నాయకుడు. పండ్రెండు వత్సరముల సావర్కారు తనతోడిబాలురకు భారతస్వాతంత్ర్యమును గూర్చియు, తాను దాని నెట్లు సంపాదింపబూనినదియు మొదలగు ననేకవిషయములను బోధించుచుండెను.

1895 వ సంవత్సరమున హిందూమహమ్మదీయుల కలహములు చెలరేగి దేశమంతయు భీభత్సరూపమును దాల్చెను. దేవాలయములు కొల్లగొట్టబడెను. వెంటనే యీబాలనాయకుడు తనమతస్థులపై గావింపబడిన యపచారములను సహింపలేక పదినం(డెం(డుగురు బాలయోధులతో [illegible] పక్క యున్న మసీదుపై దండెత్తెను. మహారాష్ట్రసైన్యము లాఠీలను బట్టుకొని శత్రువులకొఱ కటునిటు జూచెను. కాని శత్రువులును కాన్పింపరైరి! వారిట్లు జయమును తమకే చేకూర్చుకొని విజయసూచకముగా [illegible] రెండు [illegible] వుల [illegible], గో[illegible] ములు మొదలగు [illegible] నూడబెట్టి సగర్వముగా వెడలిపోయిరి. కాని మరుసటి వారము మహమ్మదీయసైన్యములతో గొప్పపోరు సంభవించెను. కొంతమంది మహమ్మదీయబాలురును, మహారాష్ట్రసైన్యమును దమపాఠశాల యావరణములో దలపడెను. పాఠశాల రణరంగముగా మారెను.

మహమ్మదీయులు తొందరలో నాయుధములను మఱచిపోయిరి. హిందూనాయకుడైన సావర్కారు చాకులు, ముండ్లు, గుండుసూదులు మొదలగు భయంకరాస్త్రములతో మహారాష్ట్రసైన్యములను సమకూర్చి జయశాలి యయ్యెను. కాని యీమహారాష్ట్రసేనాని తనసైనికులు కొందఱు దొడ్డిదారిని పారిపోవుటను, గొందఱు తల్లులు పిలుచుచుండిరను మిషతో పలాయనులగుటను జూచి యట్టిపిరికితన మెప్పటికిని కూడదని వారిని మందలించి ధైర్యసాహసములను బురికొల్పెను. రణకౌశలము, సైనికశిక్షణము, చాకచక్యము మొదలగునవి యలవడుట కతడొక వీరక్రీడను గనిపెట్టెను. వారు తమలో గొందఱు మహమ్మదీయసైన్యమనియు, కొందఱు మహారాష్ట్రసైన్యమనియు, కొంద ఱాంగ్లసైన్యమనియు, విభజనచేసికొని యొకరితోనొకరు పోరుసల్పుచు మహారాష్ట్రసైన్యమునకే యెప్పుడును జయమును గూర్చుచు యుద్ధక్రీడలను జేయుచుండెడివారు. సావర్కారు చిన్నతనమునందే తనతల్లిని గోల్పోయెను. కాని యేతల్లి శివాజీమహారాజున కంగరక్షయై జయమునుగూర్చెనో యట్టి భవానీ, యట్టిదుర్గ ఆతనికి గూడ నిలువేల్పయ్యెను. దుర్గయే యతనికి సాక్షాత్కరించిన తల్లియైన ట్లతడు దనయాశానాశయములను, కోర్కెలను, విచారములను, భారతస్వాతంత్ర్యప్రయత్నములను నామెవిగ్రహముమ్రోల గంటలకొలది నిలచి నివేదించుచు తన్మయత్వము

నొందుచుండెడివాడు. భక్తవిజయాదిగ్రంథములలోని భక్తులవలెనే యితఁడును దనయిష్టదేవతయొక్క సహాయమును బొందుచున్నట్లనేకసారు లనుభవించెను.

1897 వ వత్సరము మహారాష్ట్రమున రాజకీయరణదుందుభులతో మారుమ్రోగెను. పూనాలో జరిగిన కాంగ్రెసుమహాసభ, దానిపై నిప్పులనుగ్రక్కిన సాంఘికసభాచర్చలు, శివాజీ, గణపతియుత్సవములు మొదలగునవి యన్నియును మున్నెన్నడును గదల్చనట్లు మహారాష్ట్రము నొక్కసారి కదల్చివేసెను. ప్రబోధ ప్రచారములకు మితిలేకయుండెను. పూనానగర మధికారులదృష్టిలో రాజద్రోహమున కాలవాలమయ్యెను. ఇది భారతదేశమంతను నెవ్వఁడిగా నావరించుచుండెను. పదునాలుగేండ్ల బాలుఁడైన సావర్కారు కీయుద్రిక్త రాజకీయవాతావరణమున జీవించుచు, దీనిని జుఱ్ఱుకొనుచు, దీనియందే లగ్నమనస్కుఁడయ్యెను. పూనాలోని ప్రతిపక్షజాహితధర్మము నతని నాకర్షించుచుండెను. అతఁడు ప్రతిదినమును దనగ్రామతపాలాఫీసువద్ద కాచుకొనియుండి పూనానుండి పత్రికలువచ్చుటతోడనే నత్యాతురతతో వాటినామూలాగ్రముగ బఠించుచు నూతనసమస్యలను గూలంకషముగ చర్చించుచుండెను. ఈసమయముననే భారతదేశమున భయంకరవార్తలు వినవచ్చెను. విక్టోరియామహారాజ్ఞి షష్టిపూర్తి మహోత్సవములతో యావద్భారతదేశమును సంతసించుచు

న్నదనుకొనుచుండగా 22 వ జూను 1897 వ సంవత్సరమున ప్లేగుదినములలో పూనాప్రజలను హింసించి దుష్పరిపాలనకు గడంగిన రేండు, ఐరెస్టు లనునధికారులు నిర్భయముగా జంపబడిరి. ఈహత్యలను గావించినవారిలో ప్రధాననాయకుడు దామోదరఛాఫేకరు. దామోదర, బాలకృష్ణఛాఫేకరు లిద్దరును సోదరులు. వీరి రాజకీయచర్యలనుగురించి రౌలటురిపోర్టు యిట్లు వ్రాయుచున్నది. “ఈయిద్దరుసోదరులును చిత్పవనబ్రాహ్మణులు. ఈచిత్పవనబ్రాహ్మణులే మహామ్మదీయపరిపాలనపాటినుండియు విప్లవోద్యమములను లేవదీసి మహామ్మదీయసామ్రాజ్యమును గూల్చి బ్రిటిషుప్రభుత్వమును గూడ కూలగత్రోయుటకు ప్రయత్నించువారిలో నగ్రగణ్యులు. ఈసోదరులిద్దరును పూనాలో హిందూమతమునకు గలుగు నాటంకముల నూడబెరుకు సంఘము” అను పేరట శారీరక పరిశ్రమను, వీరశిక్షణమును గఱపుట కొక సంఘము నేర్పరచిరి. వారు శివాజీ, గణపతి యుత్సవములను జరుపుచు బహిరంగముగా నిట్లుపాడుచు ప్రజల నుద్బోధించుచుండిరి.

## —| శివాజీ శ్లోకములు. |—

“ఛత్రపతిశివాజీ,” “శివాజిమహారాజు” అను కేకలిడుచు నతనిగాథలను జెప్పుకొని సంతోషించినంతమాత్రమున మనకు స్వాతంత్ర్యము చేకూరదు. బాజీ, శివాజీలవలెనే బాహుబలమును ప్రదర్శించుటకు ప్రతివాడును సంసిద్ధుడై

యుండవలెను. మీరు కత్తులను గవచములను ధరించు టత్యవసరము. మనము శత్రువులను జంపివేయవలెను. మనజాతీయయుద్ధములో మనము రణరంగమున బోరుచు ప్రాణముల నర్పింపవలెను. మనమతమును నాశనముచేయు మనశత్రువుల రక్తముతో భారతభూమిని పవిత్రముచేయుపలెను.''

## —। గణపతిశ్లోకములు. ।—

"ఆహా! పార్వతీతనయ! నీవిట్లు నిర్వీర్యుడవై శృంఖలాబద్ధుడవగుచు నెట్లుపడియుండగలిగితివో కదా! ఇంతకంటె నీ వాత్మహత్యను గావించుకొనుట మేలు! ఖూనీదారులు కసాయివాండ్రవలె మనగోవులను, గోవత్సములను నిర్దయతో దెగ నఱుకుచున్నారు. మనము గోహత్యా నిమిత్తమునుండి తొలగింపవలెను. మీప్రాణముల నర్పింపుడు! కాని యాంగ్లేయులను చంపివేయుడు. సోమరులై భారతభూమికి జెడబుట్టు బరువుచేటుగాకుడు! దీనిని హిందూస్థానమందురు. కాని దీని నాంగ్లేయులు బరిపాలించుచుండిరేల?"

ఇట్లు ప్రభుత్వమువారి యుత్సవములను ధిక్కరించుచు గావించిన యీహత్యల వెనుక రాజద్రోహమున్నదని ప్రభుత్వమువా రనుమాన పడి నిర్బంధప్రయోగములకు గడంగిరి. నాటుసోదరులు దేశాంతరవాస శిక్షనొందిరి. తిలకు నిర్బంధింప బడెను. ప్రభుత్వమువారిచే బహుమతులను బడసిన ద్రావిడుసోదరు లీహత్య గావించినది దామోదరఛాఫేక

రని వారికెత్తింగించెను. దామోదరఛాఫీక రురితీయబడెను. వెంటనే రనడేయును, ఛాఫీకరుల కనిష్ఠసోదరుడును గలసి ద్రోహులను జంపివేసిరి. ఈవార్తలన్నియు నొకటితరువాత నొకటి బాంబుమోతలవలె ప్రజాహృదయమును బ్రద్దలు చేయజొచ్చెను. ఛాఫీకరులు హంతకులని కొందఱు నిరసింపసాగిరి. కాని మరికొందఱు వీరిని దేశముకొఱకు ప్రాణముల నర్పించిన దేశభక్తులని రహస్యముగా మెచ్చుకొనుచుండిరి. బాలవినాయకు డీవెనుకటిగణములో నొకడు. చివరకు రనడీఛాఫీకరులుగూడ యరవాడలో నురితీయబడిరను ఘోరవార్త లరుదెంచెను. ఉరితీయునాడు వారు ప్రాతఃకాలముననే లేచి చాలసేపు ప్రార్థనలను సలిపి భగవద్గీతలోని శ్లోకములను బఠించుచు నురిస్తంభము నెక్కిరి! ఈయసాధారణధైర్యసాహసములు నీహృదయవిదారకవార్తయును బాలవినాయకుని దుఃఖసముద్రమున ముంచివేసెను. కంట నీరుజొటజొట కారుచుండ సావర్కా రీవార్తలనన్నిటిని జదువుచు నిట్లు వాపోయెను. "ఆహా! ఛాఫీకరు సోదరులు గతించిరి. వారు నిందుస్థానవనమున నాశాలతలు బల్లవించుచుండ దేశవిముక్తికై దమకుటుంబములను, స్నేహితులను, బిన్నపాపలను, సకలైశ్వర్యములను జివరకు ప్రాణములనుగూడ మాతృపాదారవిందములకడ నాహుతియొనర్చిరి. నేనో! కడుపారకుడుచుచు, త్రాగుచు, భోగముల ననుభవించుచు గులుకుచుండుటలా! అట్లు కులుకుచుండగలనా! వారికోరిక లింక

ను నీడేరలేదు ! వారికృషి ఫలప్రదముకాలేదు! నాకుటుంబ మును, నాయన్నదమ్ములను, నాసర్వస్వమును జివరకు ప్రాణ ములనుగూడ గోల్పోయియైన వారిపనిని పూర్తిచేయుటకు నే నేల దీక్షను వహింపరాదు ? నేను దానిని పూర్తిచేసెదను. లేదా ఆప్రయత్నములో నాప్రాణముల నర్పింతును." అని సావర్కారు తన యిలువేల్పైన దుర్గను జేరి నాడు భారతస్వా తంత్ర్యముకొఱకు పోరిన శివాజీమహారాజును దా నెట్లాశీర్వ దించెనో యట్లే తననుకూడ నాశీర్వదింప వేడుకొని యాజగ జ్జననిమ్రోల బద్ధముకై నిలచి "భారతదాస్యవిముక్తికై నా ప్రాణములను సమర్పించుచున్నాడ"నని శపథముపూనెను. "నేను నాదీక్షానలజ్వాలలచే భారతయువకుల నందఱ నొక్క- సారి రగుల్కొల్పెదను ! రహస్యసంఘములనుగూర్చి, యా యుధములను సేకరించుకొని, కదనరంగమున బ్రవేశింతును. అవసరమగుచో శస్త్రపాణినై యామెకొఱ కాహుతియగుదు ను.'' అతని యమోఘశపథమును వీక్షించుచు దుర్గ జనని వలె చిరునవ్వుతో నతని నాశీర్వదించెను.

ఆయువకునియొక్క యాభయంకరశపథముతోనే 'య భినవభారతసంఘబీజము ఉత్పన్నమయ్యెను. వెంటనే తన కీడు జోడగు యువకభటావళిని జేరదీసి యతడు వారికి దనప్రతిజ్ఞ నెఱింగించి వారినిగూడ స్వరాజ్యదీక్షితుల నొనర్చి గ్రామ గ్రామములందును శివాజి గణపతి యుత్సవములను ప్రోత్స

హించెను. ప్రజలలో నుద్రేకమును రగుల్కొలుపనెంచి యతడు ఛాఫేకరుసోదరుల స్తుతించుచు నొకగీతమును వ్రాయుచుండ నొకనాడు నిశీథమందు దామోదరపంతు కన్నీటిముత్యములు జోటజోట కారుచుండ నొకదీపమువద్ద కూర్చుని పదముల గూర్చుచున్న తనకుమారుని సమీపించెను. సావర్కారు కవిత్వములో మగ్నుడై యతనిని గానకుండెను. చివరకు దామోదరపంతు యతనిని తట్టి, చేతనున్న కాగితమును తీసుకొని చదివి యాగీతమున కత్యాశ్చర్యపడెను. ఛాఫేకరు పేరును స్మరించుటే రాజద్రోహము! ఇట్టిగీతమును జూచుచో ప్రభుత్వక్రోధానలమునకు మేరయుండదు! దామోదరపంతు తిలకుమహాశయుని యనుచరుడు! సావర్కారునకు రాజకీయాభినివేశము దనతండ్రివలననే కలిగెను. అయినను యీగీతము దామోదరపంతునకు జాలభయమును కలుగజేసెను. ఈగీతము బయటపడిన సావర్కారు పిన్నవయస్సుతనిని రక్షింపజాలదు. కనుక నతని నెమ్మిన వారింపనెంచి "నీ వింకను బాలుడవు. ఇట్టి గంభీరమైన యాలోచనలు నీ లేతమెదడునకు దగనిభారమును గలుగజేయును. ఇక వీనినిమాని సంతోషమునుగూర్చు చిన్నచిన్న తేలికగీతములను పాడుకొనుము. పౌరుషోదయము గుటతోడనే నీధర్మమును సఫలముచేసికొనుటకు దగినమార్గములను, సాధనసంపత్తిని జేకూర్చుకొనవచ్చును. కేవల భావోద్రేకములతోగూడిన యిట్టి యకాలకార్యాచరణములవల

న నీకును, నీకుటుంబమునకును గూడ నసంఖ్యాకము లైన యుపద్రవములను దెచ్చిపెట్టినవాడ వగుదువు." అని మందలించెను.

కాని యిట్టిమందలింపులవలన సావర్కారుయొక్క యావేశ మణగలేదు. సరికదా యతడు తనకార్యములను మరింత తీవ్రతతో రహస్యమున జరుపుకొనుచుండెను. ఇంటిలో నున్నవారందఱును నిద్రపోయిన తరువాత నతడొంటరిగా నీ యసంపూర్తిగీతమును పూర్తిజేయజొచ్చెను. అది పూర్తియైన తరువాత నతనిమిత్రు లాగీతమును విని పులకితగాత్రులగుచు నది సావర్కారు వ్రాసినదేయని విశ్వసింపకుండిరి. తరువాత నతని కళాశాలదినములలో మిత్రులను జేరదీసి యత డాగీతమును భావావేశమున బాడుచుండ, స్నేహితులందఱు నొడలు గగుర్పాటుజెందుచుండ, విచారకలుషితనయనముల నుండి జలజల నీరు స్రవించుచుండ, తలలు వంకించుచు శపథములను బూనుచుండెడివారు. నాటినుండియు నత డెప్పుడును భారతస్వాతంత్ర్యస్వప్నములనే గాంచుచుండెను.

ఇట్లుండ ప్లేగు సావర్కారుగృహమునే యావహించి దామోదరపంతును దనకడుపున బెట్టుకొనెను. వెంటనే శవ మింకను యింటనుండగనే యిల్లువిడిచిపోవలెనని యధికారులు వారిని సాగనంపుటచే చావుబ్రతుకులలోనున్న పినతండ్రిని, నదే యవస్థలోనున్న నారాయణసావర్కారును దీసికొని

వా రూరుబయటనున్న యొకపాడుదేవాలయమునకు బోవలసి వచ్చెను. ఆపాడుదేవాలయమున నిశీథమందు, చుట్టుపట్ల నొక్కపిట్టయైనను పలుకాడువారు లేకయుండ, బాలురైనగణేశ వినాయక సావర్కారులును, గణేశునిధైర్యరాశియగు భార్యయు, నొకకుక్కయు జనిపోవనున్న యారోగుల నిద్దరను రాత్రియంతయు గాచుచుండెడివారు. ఇట్లుండ వారిపినతండ్రికూడ ప్లేగువాత బడెను. ప్లేగు మిగిలినవారినిగూడ విడిచిపెట్టునట్లులేదు. ఇంతలో నొకస్నేహితుని పిలుపు నంగీకరించి వారు నాశికకు పోయి నారాయణసావర్కారును ప్లేగువైద్యశాలలో నుంచిరి. గణేశు డచ్చటనేయుండి వాని కుపచారమును జేయుచుండెను. నాశికగూడ ప్లేగుతో మునిగియుండెను. బాలవినాయకు డమావాస్యరాత్రులందు నిర్జనరాజవీథులం దొంటరిగా నన్నదమ్ముల కాహారమును గొనిపోవచుండ మధ్యమధ్య "రామ్" "రామ్" "రామ్" "రామ్" అను కేకలతో శవము లెదురువచ్చుచు భయమును గొల్పుచుండ నతి డెట్లో వైద్యశాలను జేరుచుండెను. ఈభీభత్సము చాలక గ్రాజోలును ప్లేగు గణేశునకుగూడ సంభవించెను. ఈవార్తను విని వినాయకు డెట్లో తనశోకము నాపుకొని వారి కుపచారములను గావించి యిల్లుజేరి దుఃఖము నాపుకొనజాలక యేడ్వసాగెను. ఈకష్టములలో గణేశునిభార్య యశోదాబాయియే యతనికి ధైర్యము జెప్పుచు నోదార్చుచుండెడిది. చిట్టచివరకు

దైవవశమున వా రిరువురును ప్లేగునుండి రక్షింపబడిరి అప్పటినుండియు సావర్కారుసోదరులువిద్యాభ్యాసముకొఱకు నాశికలోనే యుండిపోయిరి.

## —। నాశిక. ।—

అన్నదమ్ము లపాయస్థితిలోనున్నను వినాయకసావర్కారుమాత్రము తనప్రచారమును సాగించుచునేయుండెను. వెంటనే యతడు 1901 సంవత్సరమున నాశికానగరమున తనరాజకీయాభిప్రాయములతో నేకీభవించినయువకుల ననేకుల జేరదీసి 'మిత్రమేల' యను రహస్యసంఘమును స్థాపించెను. ఇది పుట్టుకనుండియు విప్లవముననే బోధించుచుండెననియు, భారతస్వాతంత్ర్యసంపాదనమే దీని పరమావధియనియు, నవసరమైనచో నాయుధములతో తిరుగబడుటకుగూడ నిది సమకట్టెననియు పోలీసురిపోర్టులు చూపుచున్నవి. ప్రజలలో ప్రబోధమును కలిగించుట; తిరుగబాటుచేయుట; ఈరెండును దీని జీవికలు.

ఈమిత్రమేల త్వరలోనే నాశికలోని ప్రతి ప్రజాహితకర్మములోను పాల్గొనుచు శివాజీ, గణపతి యుత్సవములను ప్రారంభించి విప్లవసిద్ధాంతములను నిర్భయముగా బోధింప నారంభించెను. వీరికి పాఠశాలలే ప్రధానరంగములు. ప్రతివారమును రహస్యసభలు జరుగుచుండెడివి. అనేకమంది యువకుల నీరహస్యసంఘములలో జేర్చుకొనుచు దేశచరిత్ర

లను బఠించుచు, గంభీరోపన్యాసముల నొసంగుచు "ఇది యే నిజమైన జాతీయవిశ్వవిద్యాలయము. ఇచ్చట దేశపరిస్థితులనుగూర్చి చర్చించుట; తమదేశస్వాతంత్ర్యమునకై రణరంగమున వీరశయనము నలంకరించిన వీరాధివీరులనభినందించుట ; అట్టి రణశూరుల నిప్పుడును దయారుచేయుట ; పూర్వులవలెనే వీరును యుద్ధావనిలో జయించుట ; లేక వీరశయనము నలంకరించుట మొదలగు దేశభక్తియు, వీరక్రీడలును నేర్పబడును." అని సావర్కారు చెప్పుచుండెడివాడు. ఇట్టి ప్రబోధముతో నాశికానగరమున నూతనయుగము ప్రారంభమయ్యెను. ప్రభుత్వమువా రప్పుడే దీనిపై తమచూడవనేత్రమును (గూఢచారులను) ప్రయోగించిరి.

సావర్కారు 1901 వ వత్సరమున మెట్రిక్యులేషను పరీక్షలో నుత్తీర్ణుడై కళాశాలలో ప్రవేశించుటకు పూనానగరము పోవలసియుండెను. నాశికానగరమున నీవార్తవినజనులతోడనే విచారసంతోషము లుప్పతిల్ల నాబాలగోపాలమతనికి ధన్యవాదముల నొసగజొచ్చిరి. పూనానగరములోని ఫర్గుసను కాలేజీలో బ్రవేశించుచు నత డిట్లు తలపోసెను. "మే మింతవరకును మాప్రచారము నొక్క నాశికజిల్లాలో మాత్రమే నలుపగలిగితిమి. మహారాష్ట్రదేశమంతకును కిరీటమైన పూనాకు వివిధప్రాంతములనుండి ప్రతిభాశాలురగు యువకు లనేకమంది వత్తురు. వీరే ముమ్ముందు ప్రజాభిప్రా

యమును నడుపవలసిన నాయకులగుదురు కనుక వీరికి మా సిద్ధాంతప్రబోధము కలిగెనేని మహారాష్ట్రమునంత నొక్కసారి రగుల్కొలుపవచ్చును. ఈ ఘట్టమును కాశీలోనుండి నేను, మహారాష్ట్రహృదయము నొక్కసారి శోధించి, రాష్ట్రమునంత నొక్కుమ్మడి పోతపోయవలసియున్నది."

అతడు కళాశాలలోనున్న యానాలుగు వత్సరములలోను విశేషప్రబోధము జరిగెనని వేఱుగ జెప్పనక్కరలేదు. ఎంతరాజకీయాందోళనలో మునిగియున్నను నతడెప్పుడును దన విద్యాభ్యాసమును నిర్లక్ష్యము చేసియెఱుగడు. ఒక్కనిమిషమైనను వృథపుచ్చక నతడెప్పుడును విద్యాగోష్ఠిలో నుండుటచే నొడలెఱుగని విద్యార్థులతనికి పుస్తకప్రియుడని పేరు బెట్టిరి. అతడు మహారాష్ట్రకవుల గ్రంథములనన్నిటిని గాలించెను. చరిత్రమునన్న నతడు చెవి కోసికొనును; ప్రపంచజాతుల కథానకమునంతయు జీర్ణముచేసికొనెను. శిల్పవిచిత్రముల నన్నింటిని నమలి మ్రింగెను; అతడు మహావక్త; అతడే విషయమునుగూర్చి యుపన్యసించినను పండితపామరజనరంజకము గానుండి సభాస్థలియంతయు చిత్రరువ్రువలె నిశ్చేష్టమై యుండును. త్వరలోనే కళాశాలలోని విద్యార్థులందఱును జంద్రుని జకోరపక్షులు చేరునట్లు సావర్కారుచుట్టును జేరనారంభించిరి. అతనికీర్తి దిశల పిక్కటిల్లజొచ్చెను. పూనానగరరాజకీయములలో సావర్కారుపేరు ప్రతిధ్వనించెను. అత

నిప్రతిథ దినదినప్రవర్ధమాన మగుచు నగరమునందలి వివిధ విద్యార్థిసంఘము లన్నియును "సావర్కారు శిబిరమున" లీనమగుచుండెను.

ఇటలీవిప్లవము, ఫ్రెంచివిప్లవము మొదలగు నుత్కృష్ట విషయములతోను, సావర్కారుయొక్క అనర్గళవక్తృత్వము తోను గళాశాలాధివసములు మారుమ్రోగుచుండెను. కంఠ జోళ్ళతోడను, కాళ్ళజోళ్ళతోడను, మెడపట్టీలతోడను (neckties) దొరటోపీలతోడను, చేతికర్రలతోడను టక్కుటిక్కుమనుచు, కాలహరణకులై కేళీవిలాసముగా, తోడిబాలురు తేయాకు కాఫీ మొదలగు పాశ్చాత్యత్రాగుడులకు దాసులై విందుల నారగించుచుండ సావర్కారుశిబిరము ప్రతి యాదివారమును సమీపగ్రామమున నొకకొండగృహచెంత పాడుపడియున్న శివాలయములో దమప్రచారమింకను దేశమంతట నెట్లువిజృంభింపవలెనో, దేశస్వాతంత్ర్యరక్షణముకై తా నెట్లు పోరుసలుపవలెనో, యాయుధసామగ్రి నెట్లుసమకూర్చుకొనవలెనో మొదలగు రహస్యచర్చలను జేయుచుండెడివారు. అంతకంత కీబృందమభివృద్ధికాజొచ్చెను. వీరందఱొకే మాదిరిదుస్తులను ధరించుచు నతిశ్రద్ధగా తమపాఠములనుజదివి, పరీక్షలందుత్తీర్ణులగుచు, నిరాడంబరజీవనమును జేయుచు వీరక్రీడలందారితేరుచు, నెప్పుడును రాజకీయవిషయములనే చర్చించుకొనుచు, ప్రపంచజాతులు తమస్వాతంత్ర్యముకొఱ

కెళ్లుపోరెనో, భారతదేశముకూడ తనదాస్యశృంఖలావిచ్ఛేద
ము నెట్లుగావించుకొననగునో, మొదలగుసమస్యలను బహి
ష్కరించుచు, నప్పటప్పట రణప్రాప్తికి వన్నెకెక్కిన తమపూ
ర్వుల పురాతనసమరసీమలకు భారతవీరప్రపంచమును స్మరిం
చుకొనుటకు బోవుచుండెడివారు. వారొకసారి సింహగడదుర్గ
మును సందర్శించి, అప్రతిమాన యశోధనుడైన తానాజీని
మానసక్షేత్రమున నిలిపి, తమప్రతిజ్ఞలను దిక్కుల నచ్చట ప్ర
తిధ్వనింపజేసి నమ్రశిరస్కులై, యతనివలెనే తాముకు దమ
దేశమునకును ప్రజలకును సేవచేయుటలోనే మృతినొందున
ట్లు ప్రసాదింపుమని యతనిని ప్రార్థించిరి.

—॥ వందేమాతరం ॥—

ఇట్లుండ 1905-6 సంవత్సరములలో వందేమాతరోద్య
మము ప్రారంభమయ్యెను. "సావర్కారుశిబిరము" వెంటనే
పూనా,నాశిక మొదలగుపట్టణములందేగాక పల్లెపల్లెలందును
తీవ్రప్రచారమును జేసెను.సావర్కారు ప్రతిదినమును మూడు
నాలుగు వేదికలపై నుపన్యసించుచు, వేనకువేలు ప్రజలలో
ప్రబోధబీజములను నాటుచుండెను.అతనియుపన్యాసతరంగము
లు ప్రజలను రాజకీయరంగములో ముంచివేసెను. అనేకస్థల
ములనుండి యతనికాహ్వానములు కురియుచుండెను. ప్రజల
లో "విదేశీ" పై ద్వేషమును కలిగించుటకును, స్వదేశీదీక్ష నన
ర్గళముగా వృద్ధిజెందించుటకును విదేశవస్త్రములను దెప్పించి

గొప్పహోమగుండము నేర్పాటుచేసి యగ్నిజ్వాలల కాహుతి యొనర్పవలెనని యతడు వెలిబుచ్చెను. తిలకుమహాశయుడు గూడ దీనికి ప్రజలు విముఖులగుదురేమో యని సందేహించెను. కాని సావర్కారు తనపట్టును వీడక ననేకచోట్ల నుప న్యసించెను. టోపీలు, కోట్లు, షర్టులు, మొదలగు విదేశసామాగ్రి కుప్పలుకుప్పలుగా కురియనారంభించెను. ఈవిదేశవస్త్రరాసులను బండ్లపై నెక్కించి యొక గొప్పమైదానమునకు గొంపోయినప్పుడు గంగాపుష్కరమునకు బోవు ప్రజవలె యిసుకవేసినను రాలకుండ ప్రజ లచ్చట గుంపులుగూడిరి. ఇదంతయును జూచి తిలకుమహాశయుడు విగతసంశయుడై నాయకత్వమును వహించెను. మైదానములో గొప్పచితి యేర్పరుపబడెను. అనేకమంది వక్త లుపన్యసించిరి. ఎవరోయొకరు దీనివలన గలుగు నార్థికనష్టమును సూచించిరి. వెంటనే సావర్కారు [illegible] గలుగు [illegible]తికఫలమును అణాలు పైసలతో లెక్కింపరాదనియు, మనము విదేశవస్త్రములనేకాక "విదేశీ" నే తగులబెట్టుచున్న సంగతిని గ్రహింపవలెననియు బదులుచెప్పెను. తిలకు, పరంజిపిగార్లు మహోపన్యాసముల నిచ్చిరి. పరంజిపిగారు రాశిలోని యొకకోటును దీసి యాకోటుజేబులో భారతదేశమునుండి ధనరాసులను, వజ్రములను, కిరీటములను, దొంగతనముగా తర్లించుకొనిపోయెనో వర్ణించి "ఓమాంత్రికులారా! ఈచిన్నిజేబులో దాగొని మాజాతినం

తను పీల్చి పిప్పిచేసిన నీ విద్రోహకరమోహనాకారము భస్మపటలమగుగాక ! అగ్నిహోత్రమా ! దీని నాహుతిగొనుము! దీనితోపాటు మాజాతీయపాపములనుగూడ దహించివేయుము !" అని హోమమును బూర్తిచేసెను.

ఈప్రథమదహనసంస్కారము భారతదేశము నంతను వెలుగొందజేసెను. భారతపత్రికలన్నియును తర్కవితర్కములను జేయ నారంభించెను. ఆంగ్లజాతివారి పత్రికలు గగ్గోలుపెట్టసాగెను.

సావర్కారుయొక్క రాజకీయాందోళన కళాశాలాధికారులను భయభ్రాంతులను గావించెను. వారెన్నిసారులు మందలించినను సతము తన యతివాదమును విరమింపడాయెను. చివరకీవిదేశవస్త్రదహనసంస్కారమును సావర్కారు ప్రతిచోటను గావించుటను జూచి తామునుకూడ ప్రభుత్వాగ్రహధానలమునకు గురికావచ్చునని భయపడి, వారతని కళాశాలవసతిగృహములనుండి వెడలగొట్టుటయేగాక పదిరూపాయలు జరిమానానుగూడ విధించిరి. ఈయక్రమమునకు కేసరిపత్రిక సింహనాదమును బూరించెను.

గ్రామగ్రామమునను యసమ్మతిసభలు జరిగి యధికారదుర్ణయము ఖండింపబడెను. వెంటనే జరిమానాకొఱకొక నిధి యేర్పరుపబడెను. వందలకొలది ప్రజలు ధనదర్ణమును గురిపించిరి.

జరిమానా పోను మిగతధనమంతయు పైసానిధికి సమర్పింపబడెను. ఒకమూల తీవ్రరాజకీయాందోళనము జరుగుచున్నను, బి. ఏ. పరీక్షకు కొద్దివారములే గడువున్నను వత డొక్కక్షణమైనను వృథపుచ్చక పరీక్షయం దుత్తీర్ణు డయ్యెను. అతడు పరీక్షలో నెగ్గనిచో నతనిని, యువని రాజకీయములను, రాజకీయనాయకులను, స్వరాజ్యమునుగూడ దూషింపవలెనని యధికారప్రియకపూర్వహాలులు జపముచేయుచుండిరి. పాపము వారియాశ లడియాశ లయ్యెను !

1905 లో సావర్కారు పట్టభద్రు డయ్యెను. విశ్వవిద్యాలయబందిఖానానుండి బయటపడిన సావర్కారు తా నదివరకు దేశమంతటను స్థాపించిన సంఘములను బలపరచుటకొరకు రహస్యసభ నాహ్వానము చేసెను. ఆసభకు మూలమూలలనుండి రెండువందలమందిపైగా ప్రతినిధులు వచ్చిరి. తమతమ సంఘములచట్టములనుగూర్చియు, భావిరాజకీయనీతినిగూర్చియు విపులముగా జర్చింపబడెను. వారదివరకు మహారాష్ట్రమంతటను దమసందేశము నెట్లు వ్యాపింపజేసిరో యట్లే భారతదేశములోనితదితర రాష్ట్రములకుగూడ గొంపోవలెనని నిశ్చయించిరి. నాయకుడైన సావర్కారు ప్రతియక్షరమును స్పష్టముగా వ్యక్తీకరించుచుండ, ప్రతినిధులందఱును వినమ్రులై నిలచి, యక్షతశిరస్కులై, పుష్పాంజలులతో స్వరాజ్యవిజయ[illegible]దీక్షితులై, తదుత్సాహాతిరేకములచే బులకితగాత్రులై,

శివాజీ, బాజీ, మూజినీ మొదలగు వీరచరిత్రములనే తాము ను యాచరింపనున్నారమను హృదయస్వాంతములతో నారంగ మును దివ్యరంగముగా నొనర్చిరి. అప్పుడే దీని "అభినవభా రత" మను నూతననామకరణ మొసంగబడెను. వీరరసమును బురికొల్పు ననేకపాటలతో మహారాష్ట్రమంతటను బ్రచా రము గావింపబడెను.

ఇట్టిసమయమున హోంమెరూలులీగునాయకు డగు పండిత శ్యాంజీకృష్ణవర్మ స్వాతంత్ర్యదేశములలోనుండి రాజకీ యముల నభ్యసించుటకు భారతయువకులను బ్రోత్సహింప గొన్నియుపకారవేతనముల నొసంగెను. అదివఱకే దేశప్రఖ్యా తిగాంచిన సావర్కారున కొకవేతన మీయబడెను. అతడింగ్లం డులో బారిష్టరుపరీక్షకు జదువవలెనని నిశ్చయించుకొనెను. తనప్రచారముపిషయమైకూడ నతడిట్లుతలపోసెను. "నేను మహారాష్ట్రహృదయమైనపూనానగరములో ఫర్గుసనుకాలేజీ లోనుండి భావిమహారాష్ట్రనాయకులు గాబోవు విద్యార్థికగ ణము నెట్లు రాజకీయములలో ప్రబోధితులను గావింపగలిగి తినో యట్లే భారతదేశవివిధరాష్ట్రములనుండియు వచ్చు బుద్ధిశాలురను లండనునగరమున జేపట్టవచ్చును. సర్వసాధా రణముగా శ్రీమంతులును, ధీమంతులును మాత్రమే విద్యన భ్యసించుట కచ్చట కేతెంచెదరు. అట్టివారు భారతదేశమంత టను బారిష్టరులుగను, కలెక్టరులుగను తదితర గొప్పగొప్ప యు

ద్యోగులుగను బనిచేయుటచే వారిలో మాయుద్యమబీజముల ను నాటగలిగితినేని భారతస్వాతంత్ర్యోద్యమమున కపారసేవ ను వారు చేయగలరు. మరియు నాంగ్లదేశహృదయమైన లండనులో నుండుటచే వారిమర్మములను, బలాబలములను బూర్తిగా గ్రహించుట కెంతయో యవకాశముండును.” అచ్చట రుష్యాదేశపు విప్లవరహస్యములను, బాంబులు మొదలగు ప్రేలుడుసామగ్రిని తయారుచేయు విధమునుగూడ నేర్చుకొనవచ్చునని యతడాశించినట్లు పోలీసురిపోర్టులవలన దెలియవచ్చుచున్నది. అదివఱకే సావర్కారుయొక్క ప్రచారము నణచివేయవలెనని ప్రభుత్వమువా రాలోచించుచుండిరి. అతని యుపన్యాసము లుద్రేకపూరితములై నిప్పులు గ్రక్కుచుండెను. నిర్బంధవదంతులు బయలుదేరెను. నిర్బంధించినచో నతనికి మరింత ప్రాముఖ్యతను దెచ్చిపెట్టినవార మగుదుమని ప్రభుత్వమువారు భయపడుచుండిరి. ఇట్టి సమయమున నీవార్త వారికి సంతసమును గలిగించెను. ఇంగ్లండునకు బోవుచో నాంగ్లదేశరాజధానియగు లండనులో నుండుటచే నాంగ్లేయుల పౌరుషప్రతాపములను కండ్లార జూచి యతడట్టివారల క్రోధానలమున కాహుతియగుటకు విరమించుకొనుననియు, బారిష్టరువృత్తివలన గలుగు నపారధనార్జనలోబడి యితరుల వలెనే రాజకీయములను మానుకొనుననియు, ప్రభుత్వమువా రెట్టిచర్యలను దీసికొనక నూరకుండిరి.

సావర్కారు లండనుకు ప్రయాణమగుచున్న సమయమునగూడ బొంబాయిలో నభినవభారతసంఘముయొక్క కేంద్రస్థాన మొకటి స్థాపించి యచ్చటి కళాశాలలోని విద్యార్థుల నందఱను దనశిబిరమున జేర్చుకొనెను. అతడు విహారియను నొకవార్తాపత్రికనుగూడ స్థాపించెను. మహారాష్ట్రపత్రికలలో నది పత్రికారాజమై ప్రజాహృదయము నాకర్షించెను. భారతదేశములో దగు ప్రచారమునకు దనకుడిభుజము లనదగువారల నేర్పరచి యతడు 1906 లో నిరువది రెండవయేట నాంగ్లదేశ రాజధానియగు లండనునగరమునకు బయనమయ్యెను.

నాశికానగర మంతయు సావర్కారు శిష్యబృందముతోను, మిత్రగణముతోను, యనుచరభటావళితోను, నిండియుండి యతనిని దేవతాస్వరూపమువలె నారాధించుచుండెను. పరీక్షానంతరము నాలుగేండ్లలో నతడు తిరుగవచ్చి నాయకత్వమును వహించునుగాక యని వారానాడు ప్రార్థనలను సలిపిరి. కాని రానున్న విపత్తు నాశిక కేమియెఱుక ! ఇరువది రెండువత్సరములదీర్ఘకాలము దమనాయకు నగ్నికీలలమధ్య దపింపుమని విధి వ్రాసిపెట్టినట్లు నాశికానగరము కలలోనైన దలంపదాయెను !

—:0:—

ఓడలో ప్రయాణముచేయుచున్నను సావర్కారు రామనామమువలె స్వాతంత్ర్యమంత్రమునే జపించుచుండెను.

శిష్యబృందము ; సహచరకోటి ; మిత్రమండలి; భీమబలుల వంటి యన్నదమ్ములు; పౌరుషగృహము; మహారాష్ట్రము—వీనినివిడచుట—ఆరువేలమైళ్లు; ఆంగ్లదేశము ; లండనునగరము; శత్రుమధ్యము; విప్లవప్రయత్నములు; తిరిగివచ్చుట! ఆహా ! ఎట్టివిపరీతసంఘటనములు ! కాని యివేవియును సావర్కారును జలింపజేయలేదు.

సాధారణముగా భారతయువకులకు సముద్రయానమనిన గంటకముగా నుండును. ఓడలోని బ్రయాణీకులు చాలవఱకు భారతదేశమును బరిపాలించు ప్రభుత్వజాతికి చెందువారమను దురభిమానగ్రస్తులగు తెల్లవారే యగుటచేతను, సముద్రప్రయాణముల కలవాటులేక సముద్రజ్వరముతో బాధపడుటచేతను, బంధుమిత్రులను వీడి చిరకాలముండవలెనను స్వగృహచింతాక్రాంతతచేతను వారిలో గొంద ఱోడదిగకుండగనేకూడ గృహోన్ముఖు లగుచుందురు. సావర్కారెక్కిన యోడలో నొకశ్రీమంతుడైన భారతయువకుడుండెను. ఇతడట్టిజ్వరముచే బాధపడుచు నోడ మొట్టమొదటి రేవును జేరగనే యింటికిబోవలెనని యనుకొనుచు నొకరాత్రి తనగదిని వదలి యోడపైభాగమునకు బోయెను. అచ్చట సావర్కారు చె[illegible]వాయువులను, వాటికిదాళమువేయు సముద్రతరంగములను, పార్వణచంద్రబింబబింబితమై కద[illegible] రజితకాంతులచే హాసించుచున్న యాకసవీధిని జూచి తన్మ

యుక్తె పాటలు బాడుకొనుచుండెను. ఆయువకుడు మెల్లగా వానిని సమీపించి యత డట్లానందపరవశుడగుట కాశ్చర్యపడి తనమనోరథము నతని కెఱింగించెను. వెంటనే సావర్కారు "అశ్లీల యధైర్యపడెదవు? నిన్ను బాధించునది సముద్రజ్వరమా! స్వగృహజ్వరమా! లేక రెండునుగూడనా? ఆహా! మనజాతి నానాటికెంతపౌరుషశూన్య మగుచున్నది! మహారాష్ట్రకన్యకలు సముద్రము నవలీలగా దరించుటేకాక యుద్ధనౌకలనుగూడ నడిపించి యింకను రెండుశతాబ్దములైనను కాలేదు. ఆంగ్లబాలురను జూడుము! వారు కొన్నివుకాలములో భారతదేశము వచ్చుట కొఱకుమాసములు పట్టుచుండెడిది. వారు సురక్షితముగా భారతదేశమును జేరి రనువార్త బంధుమిత్రులకు దెలియుటకైనను యొకసంవత్సరమైనను బట్టుచుండెను. కాని వారెంతమాత్రమును జలింపక దేశముకాని దేశమునకు వచ్చి, లక్షలకొలదిగనున్న శత్రువులమధ్య నివసించుటయేగాక, వారితో బోరి, వారి నోడించి యొక మహాసామ్రాజ్యమును స్థాపించుకొనిరి. మనమో! ఈమొదటితరగతి ప్రయాణసౌకర్యములను, హంసతూలికాతల్పములు మొదలగు సమస్తోపభోగములను ముందరే యేర్పాటుచేసికొనినను గూడ వణకుచున్నారము! నీ వెంతమాత్రమును గృహోన్ముఖుడవు కాగూడదు. నీతల్లి శ్రీమంతురాలనియు, బారిష్టరుపదపవదవి గలుగులాభ మామెకు దృణప్రాయమని

యు జెప్పుచున్నావు! కాని మిత్రమా! మనతల్లులకెల్ల తల్లి యైన యీ భారతమాతమాత్ర మతిదరిద్రురాలు! ఆమె తన పుత్రులను విదేశములకుబోయి ప్రపంచ మెట్లున్నదో తమదు ర్బలత్వము లెట్టివియో, యెదిరిబల మెట్టిదో తెలిసికొనగోరు చున్నది. మనము జవసత్త్వములను, పౌరుషప్రతాపములను, సాహసమును జేకూర్చుకొనగోరుచున్నది. మన మింగ్లండు, ఫ్రాన్సు, రషియా మొదలగు దేశములకుబోయి విప్లవమును ని ర్వహించుటను, స్వాతంత్ర్యమును సంపాదించుకొనుటను నేర్చు కొనవలయునని యామె తహతహలాడుచున్నది. నీకు ధనా శయనుస్వార్థము లేనిచో నీయుత్కృష్టాశయముకొఱకై నను నీప్రయత్నమును మానుకొనవలసియున్నది. మన బంధు, మిత్ర, కళత్రాదులపై ప్రేమయందువా? ఇవి నన్ను బాధించు చున్నట్లు మరెవ్వరిని బాధించుటలేదని నేను చెప్పగలను! మ నము వారిని విడనాడుటేగాక సమయమువచ్చుచో వారును, మనమునుగూడ నాహుతికావలయునేకాని మనధర్మమును మనమెంతమాత్రమును ద్యజింపరాదు! మనకన్నతల్లి మనకు ప్రాణతుల్యమే! మనజాతికంతకును దల్లియైన మనదేశమాత మరింత ప్రాణతుల్యము! ప్రాణమే! యనుసంగతిని మరువ రాదు." అని మందలించెను.

ఇంగ్లండులో దిగుటతోడనే హోంరూలులీగునాయ కుడైన శ్యాంజీకృష్ణవర్మ యతనిని బహూకరించెను. ఆరోజుల

లో హోంరూలు ఆందోళనమే యత్యుపద్రవకరమైన రాజకీయములుగా కాంగ్రెసునాయకులచే గూడ పరిగణింపబడుచుండెను. కాని సావర్కారు లండనులో నడుగుపెట్టిన యొక సంవత్సరములోనే సర్వమును దారుమారయ్యెను! హోంరూలుప్రచారము నిస్సారపుమితవాదప్రచార మయ్యెను! అతడు "స్వేచ్ఛాభారతసంఘము" అను సంఘమునొకటి స్థాపించెను దీనిపేర ప్రతివారమును బహిరంగసభలు జరుపబడుచుండెను. భారతీయులందరును వీనిలో పాల్గొనవచ్చును. ఇచ్చట నతడు యిటలీ, ఫ్రాంసు, అమెరికా మొదలగు దేశముల చరిత్రలను, నచ్చటజరిగిన స్వాతంత్ర్యసమరములనుగూర్చి యద్భుతమైన యుపన్యాసముల నిచ్చుచుండెడివాడు. అతని పాండిత్యము, నసర్గళధార, యప్రతిహతవాదనాకౌశలము, నకుంఠితవిశ్వాసము దశదిశల ప్రజ్వరిల్లుటతోడనే భారతయువక ప్రపంచమంతయు నతని ననుసరించెను. ఆతడు వారిలో నుద్దండుల నేరి యభినవభారతసంఘములోని యంతర్మండలములో జేర్చుకొనుచుండెడివాడు. ఈవిధముగా నాక్సుఫర్డు, కేంబ్రిడ్జి, ఎడెంబరో, మాన్చెస్టరు మొదలగు కేంద్రములలోని భారతవిద్యార్థులందఱును త్వరలోనే విప్లవసిద్ధాంతములను శిరసావహించిరి.

శాంజీకృష్ణవర్మకూడ నీవిప్లవసిద్ధాంతముల నంగీకరించినట్లు బహిరంగముగా చాటి బాంబునుగురించియు, రషియ

మరహాస్యసంఘములను గురించియు దనపత్రికలో వ్రాసి, హాలోంరియాలులీగును మూసివేసి పారిసునగరమునకు వెడలిపో యెను. అతడు లండనులోనున్న "భారతగృహమును" సావర్కారుయాజమాన్యమున కిచ్చివేసెను.

ఇంగ్లండులో నభినవభారతసంఘ మంతకంతకు వృద్ధి కాజొచ్చెను. అనేకమంది యువకులు తమసర్వైశ్వర్యములను, సమస్తభోగములను, ప్రాణములనుగూడ భారతస్వాతంత్ర్య పోరాటముకొఱకు సమర్పించిరి. కలెక్టరుపరీక్షకు చదువుచు న్న లాలాహరదయాలు ప్రభుత్వమువారిచ్చు యుపకారవేతన మును ద్రోసిపుచ్చెను. అత డమెరికాలో 'గధరు' పత్రికను నడుపుచు నచ్చటి భారతయువకులలో విప్లవజ్వాలలను బ్రజ లింపజేయుచుండెను ; మరియొకప్పుడు జర్మనీ, టర్కీదేశముల లోని రాజమందిరములలో బ్రవేశించి యింగ్లండు ఐరోపామ హాసంగ్రామములో మునిగియున్ననాడు భారతదేశమునం దిరు గబాటును లేవదీయుట కాదేశముల సహాయమును బొంద యత్నములను జేయుచుండెను. అతడు నేటివఱకును విదేశము లలోనే కాలమును గడుపుచున్నాడు. సరోజినీదేవి సోదరు డగు ఛటోపాధ్యాయు డింకను జర్మనీలో దేశాంతరవాసమును జేయుచున్నాడు. ఎవనిపేరు మద్రాసురాజధానిలో గృహనా మ మయ్యెనో యట్టి వి. వి. యస్. అయ్యరు మొదలగువార లెందఱో యభినవభారతమున జేరి సావర్కారుకు కుడిభుజ ముగా పనిచేసిరి.

## వినాయకసావర్కారు జీవితము.

ఈలోపల హిందూదేశమున బంగాళావిభజనతో బయలుదేరిన యుద్యమము వందేమాతరోద్యమముగాను, భారత స్వాతంత్ర్య సమస్యగాను మారి విపరీతపరిస్థితులు సంప్రాప్తమయ్యెను! పంజాబుసింహము (లాలాలజపతిరాయి) పట్టుబడెను. అజితుసింగు హరింపబడెను. ఈవార్తలు లండనుజేరుటతోడనే యభినవభారతసంఘమునకు మరింతబలము చే[కూ]రెను. ప్రభుత్వచర్య లనుతీర్మానములతో ఖండించుట క[ొక] సభ చేయబడెను. ప్రజల జన్మహక్కులే యీవిధముగ నిరంకుశప్రభుత్వపదతాడితము లగుచుండ, నట్టిన్యాయవిహితమైన యాందోళనమైన నణగద్రొక్కబడుచుండ నిట్టివాగ్విజృంభణముల చేతను, వాగాడంబరముల చేతను గార్యసాఫల్యము కాజాలదని సావర్కారుపక్షమువారు వాదించుటచే నట్టి కాగితపుతీర్మానములకు స్వస్తి చెప్పబడెను. ముందు చేయవలసిన కర్తవ్యమేమి? యని ప్రశ్నింపబడెను. వెంటనే యభినవభారతసభ్యుడగు నొకపట్టభద్రుడు విఖ్యాతిగాంచిన తన విశ్వవిద్యాలయపదవిని దేశమాత కర్పించి రషియాకువెళ్లి బాంబులు మొదలగు మారణాస్త్ర, శస్త్రప్రయోగములలో శిక్షితుడై "జారుప్రభుత్వమును రషియనుప్రజలు డీకొనినట్లే నేనును భారతదేశములోని నిరంకుశప్రభుత్వమును డీకొనెద" నని శపథము పూనెను. వెంటనే విదేశములకు బోయి శిక్షితులగుటకు ధనము సమకూర్చబడెను.

## వినాయకసావర్కారు జీవితము.

ఈమహారాష్ట్రయువకుడును, బెంగాలు మద్రాసుల నుండి మరిద్దరును గలసి పారిసుకు బయనమయిరి. బాంబులను జేయువిధానమును నేర్చుకొనుటకు వారష్టకష్టములను బడిరి. అనేకమంది వీరియొద్ద ధనము నపహరించి రహస్యములను జెప్పక వీరిని మోసపుచ్చిరి. బాంబులను తయారుచేయునపుడు కాళ్లు, చేతులు, కండ్లు పోవుటచే ననేకమంది భారత యువకులు వికలాంగులైరి! చిట్టచివరకొక రషియనువిప్లవకారుడు బాంబులను జేయువిధమును వారికి సమగ్రముగా బోధించెను. నలువదివిధముల బాంబులను తయారు చేసిరనియు, బాంబులలో వివిధసామగ్రి యేయే భాగములలో పడునో మొదలగువిషయము లన్నిటినిగురించి పుస్తకము నొకదానిని దేశభాషలన్నిటిలోను పటములతోసహా సావర్కారే వ్రాసి యతిచమత్కారముగా భారతదేశమునకు బంపుచుండువాడనియు పోలీసురిపోర్టులు చెప్పుచున్నవి. తరువాత నీపుస్తకమే కలకత్తాలోని మానిక్తొలాతోటలలోను, అలహాబాదు, నాశిక, లాహోరు మొదలగు వివిధప్రదేశములలోను పోలీసు వారికి దొరికెను. ఈపుస్తకముల నిట్లు ప్రచురించుచు భారతదేశములోని మూలమూలలకు బంపుటేకాక అభినవభారత సంఘములోని కొంతమంది ప్రధానుల కుదయము లండనులోను, మధ్యాహ్నము పారిసులోను బాంబులను దయారుచేయు విధానమునుగూర్చి పాఠములను జెప్పుచు సావర్కారే

ప్రత్యక్షముగా వాటిని తయారుచేసి వారికి జూపించుచునొక్క నిమిషమైన వృథపుచ్చక తిరుగ నాసాయంత్రమే లండనులో స్వేచ్ఛాభారతసంఘమందిరమున చరిత్రను, రాజకీయములను ఆర్థికములనుగూర్చి గంభీరోపన్యాసముల నిచ్చెడివాడని పోలీసురిపోర్టులు విశదము చేయుచున్నవి.

బాంబుప్రయోగమును మొట్టమొదట నింగ్లండులోనే చేయవలెనని జూచిరి. కాని సావర్కారు దానివలన దామును పోలీసులపాలగుదుమనియు, మెల్లగా నీకళను భారతదేశమున ప్రవేశపెట్టవలెననియు జెప్పి వారించెను. భారతదేశములోని వివిధప్రాంతములలోనున్న విప్లవపక్షమువారి కీశాస్త్రమును బోధించుటకు ముగ్గురు, నలుగురను, లండనునుంచి ప్రత్యేకముగా పంపిరి. ఇట్లు ప్రతిచోటను దీనిని ప్రచారము చేసిరి.

వెంటనే బెంగాలులో బాంబుధ్వని మారుమోగెను. ఖుదీరాంబోసు అను నొక బెంగాలీయువకుడు కింగ్సుఫర్డు అనువాని బండిమీద బాంబును విసరెను. అది గురితప్పి కెనడీలను జంపెను. ఈవార్తను వినుటతోడనే భారతదేశమును, దానితోబాటు ప్రభుత్వమువారునుగూడ గాఢనిద్రనుండి దద్దరిల్లిరి! బాంబుతో భారతరాజకీయములలో నూతనశకమారంభమయ్యెను! ఒకప్రక్క భారతదేశములో బాంబుధ్వనులు ప్రతిధ్వనించుచుండ నింగ్లండులో సావర్కారు శిబిరము

వారి యుత్సాహము పొంగి పొరలుచుండెను. ప్రాణములను దృణప్రాయములుగా త్యజించు సాహసమును, తమప్రయత్నములను సాగించుకొనుటకు బన్నుచుండిన వివిధోపాయములును, నిర్గంధులోనే యొకనారి బాంబుమహిమను జూపింపవలెననెడి యుత్సాహమును, మాతృదేశముకొఱకై తమయసువుల నర్పింపవలెననెడు పిరావేశము మొదలగు పవిత్రత్యాగతోయములును విప్లవకారులలో శివజటాజూటమునుండి విడివడిన వియన్నదీతోయములవలె ప్రవహించుచుండెను. నాయకులు దీని నాకజాలకుండిరి. భారతగృహముయొక్క కార్యకలాపములుగూడ మితిలేకయుండెను వారము వారము సభలు; దైనికచర్యలు; యొడతెగనిప్రాత; దివారాత్రములు ముద్రింపించుట; చిన్కితోగు పుస్తకములు, కరపత్రములు వ్రాయుట; కట్టలు కట్టుట; అనేకవేల చిరునామాలకు వీటిని బంపుట; బాంబులను స్వయముగా తయారుచేయుట; బాంబుపాఠములను బోధించుట మొదలగు నీయన్నింటిలోను స్వయముగా పనిచేయుటేకాక సావర్కారు రెండు మహోత్కృష్టచరిత్రలనుగూడ వ్రాసెను. అతడు లండను జేరుటతోడనే మాజినీయొక్క స్వీయచరిత్రను తన భాషలో వ్రాయ నారంభించి యొకసంవత్సరములో ముగించెను. మహారాష్ట్రసాహిత్యములో దీనికిగలప్రఖ్యాతిని వర్ణింపనవసరములేదు. గురువులు విద్యార్థులచేతను, తండ్రిలు

పుత్రికలచేతను, నిందులోని కొన్నికొన్ని భాగములను కంఠస్థము చేయించుచుండిరి. ఉత్సవములలో నిది మతగ్రంథము గాకూడ కొన్నిచోట్ల గొంపోబడుచుండెను. చివరకు ప్రభుత్వమువారు దీనిని తమవశము చేసికొనిరి. ఈపుస్తకముయొక్క యుపోద్ఘాతములో "రాజకీయముల కాధ్యాత్మికప్రాముఖ్యత నీయవలెను. ఛత్రపతిశివాజీకాలమునాటి మహారాష్ట్రఋషియైన రామదాసుమాజీయొక్క యాధ్యాత్మికతత్త్వముననే కలిగియుండెను. ఇటలీస్వాతంత్ర్యముకొరకు మాజినీ యిటలీయువకులమీదనే యాధారపడెను. శిక్షణము ; (discipline) యుద్ధము ; ఈరెండును నాపథకమునకు జీవికలు. యుద్ధమునకు సాధనసామగ్రిని జేకూర్చుకొనుటకు మన మాయుధములను కొని సమయమువచ్చువరకును సరిహద్దుదేశములలో దాచుకొని యుంచుకొనవలెను. దేశములో నచ్చటచ్చట చాలచోట్ల చిన్నచిన్న రహస్యఫ్యాక్టరీల నొకటి కొకటి తగినంత దూరములో నుండులాగున నిర్మించి రహస్యముగా నాయుధములను దయారుచేయుచుండవలెను. ఇతరదేశములలో రహస్యసంఘములద్వారా కొనిన యాయుధములను రహస్యముగా వర్తకపుటోడలలో భారతదేశమునకు దిగుమతి చేయవలెను." అని యుండెనని రౌలటురిపోర్టు తెలియజేయుచున్నది.

రెండవ పుస్తకము 'భారతస్వాతంత్ర్యయుద్ధము.' ఇది భారతదేశమందేగాక జగద్విఖ్యాతినికూడ బడసెను.

సావర్కారుయొక్క వ్రాతలను జదివిగొనినప్రభుత్వ మీపు స్తకము బూర్తి కాకమునుపే దీనిని నిషేధించెను. ముద్రిణ చరిత్రలో నిట్టి విచిత్రచర్య యెచ్చటను జరిగియుండలేదని కొన్నియాంగ్లపత్రికలుగూడ ప్రభుత్వచర్యను గర్హించెను. ప్రభుత్వమువా రేమిచేసినను జేతురుగాక! సావర్కారు యూరపుఖండములో నీపుస్తకమును ముద్రింపించుటేగాక భారతదేశములోని వివిధప్రాంతములకు "స్కాటుకవి కావ్యములు" లేక "పిక్విక్కు క్లబ్బు పత్రికలు" అను శీర్షికలుగల పైయట్టలతో వందలకొలది పుస్తకములను పంపించెను. 1857 వ వత్సరములోని భారతస్వాతంత్ర్యయుద్ధము కేవల సిపాయి తిరుగుబాటనియు, హంతకులు, ఆదర్శహీనులు, మూర్ఖులు, పిచ్చివాండ్రు, యేసిద్ధాంతముల నెఱుగని తిరుగుబోతులు పన్నిన కుట్రయనియు నాంగ్లచరిత్రకారులు వ్రాసిన తప్పుడు వ్రాతల నన్నింటిని ఖండించి యది యొక జాతీయయుద్ధమని యు, భారతస్వాతంత్ర్యమే దాని యాశయమనియు మహారాజులు, చక్రవర్తులు, సిపాయిలు, పురుషులు, స్త్రీలు మొదలగు యావద్భారతదేశమును ధర్మరక్షణముకొఱకు బోరు సలిపెననియు సావర్కారు రూఢిపరచెను. ఈపుస్తకము దక్షిణ అమెరికాలో నొకప్రతి 130-0-0 లకు విక్రయింపబడెనట!

1857 వ సంవత్సరములోని సిపాయితిరుగుబాటులో డాము గావించిన యఖండవిజయముయొక్క యర్ధశతాబ్ధి

యుత్సవము నాంగ్లేయులు 1907 వ వత్సరములో లండను నగరమున జరిపిరి. ఈసందర్భములో నాటకములు, యుపన్యాసములు, పత్రికలు, యుత్సవములు మొదలగు వివిధ ప్రదర్శనములలో తిరుగుబాటుదారులను, వారి యాశయములను, వారిచర్యలను హేయముగాను, ద్వేషపూరితముగాను, అవమానకరముగాను బ్రదర్శించిరి. సావర్కారీజాతీయావమానమును సహింపజాలక వెంటనే నానాసాహేబు, ఝూన్సీలక్ష్మీభాయి, తాంతియాతోపె, కుమారసింగు, మౌల్వీఅహ్మదుసాహేబు మొదలగు 1857 లోని భారతనాయకుల నభినందించుటకు బూనుకొనెను. ఆంగ్లదేశమున రాజధానిలో రాక్షసులవలెను, బందిపోట్లవలెను, దమకు బరమశత్రువులవలెను నీచముగా చూడబడువారి నభినందించుట ఎంత సాహసకార్యము! అట్టి టుపన్న భారతనాయకులు కొంపలు వణకజొచ్చిరి! కాలేజీలోనున్న భారతవిద్యార్థు లందఱును "1857 లో దేశముకొఱకు కాహుతియైననాయకుల కందఱకు నభివందనములు" అను చిహ్నని పతాకములను ధరించిరి. "ఓ దేశభక్తులారా! ఆత్మార్పణాదక్షులారా!" అను కరపత్రములు పంచిపెట్టబడెను. బస్సులోను, రైళ్ళులలోను నప్పుటచ్చట చిన్నచిన్న ముష్టియుద్ధములు జరిగెను. కాలేజీలలోని యాంగ్లపండితులు రోషకషాయితనేత్రులై "వారు దేశభక్తులుగారు! హంతకులు! ఆపతకములనుదీసివేయుడు"

అని వారిని దూలనాడిరి. భారతవిద్యార్థులు తమనాయకుల ను దూలనాడినపండితులను క్షమార్పణ కోరుకొనవలసిన దని బలవంతము చేసిరి. అనేకమంది యువకులు పాఠశాలల ను విడిచిపెట్టిరి. చాలమందిని పాఠశాలలనుండి తొలగించిరి. పెక్కురను తండ్రులు భారతదేశమునకు దిరిగిరమ్మని నిర్బంధించిరి. ఇంగ్లండులో రాజకీయము లంతకంతకు శృతిమించి రాగమున బడుచుండెను. ప్రభుత్వమువారికి గాభరా యెక్కువయ్యెను.

ఇట్టి సమయమున నాంగ్లపత్రికలన్నియు గగ్గోలు పెట్ట సాగెను. స్వేచ్ఛాభారతసంఘసభలు; 1857 వ నాటి భారత స్వాతంత్ర్యయుద్ధనాయకుల నభినందించుట; భారతదేశమునకు విప్లవోద్యమప్రచారకసాహిత్యము ననేకరహస్యమార్గముల ద్వారా పంపించుట; అభినవభారతసంఘముయొక్క సమాస్త్రికలాపములు మొదలగున వన్నియును గఠినవిమర్శనలకు లోనయ్యెను. ఈ యన్నింటికిని సావర్కారే మూలపురుడని యాంగ్లపత్రికలు బహిరంగముగా వ్రాయనారంభించెను. పత్రికాప్రతినిధు లతనిని జూడవలెనని కుతూహలపడుచుండిరి.

ఒకనా డొకదైనికపత్రికాప్రతినిధి యతనిని జూడవలెనని వచ్చెను. వాని నొకపరిచారిక సావర్కారున్న గదిలోనికి గొంపోయెను. అతడొకపుస్తకమును తదేకదృష్టితో జదు

వుకొనుచుండెను. పరిచారిక వెళ్ళిపోవుచుండ నాపత్రికాప్రతినిధి "సావర్కారెచ్చట నున్నాడు?" అని మరల ప్రశ్నించెను. ఆమె "అతడే సావర్కారు" అని బదులుచెప్పెను. ఆప్రతినిధి తిరుగ నచ్చట జమువుకొనుచున్న విగ్రహము నాతురతతో నవలోకించి యాంగ్లేయులగుండెలలో నిద్రించుచున్న విప్లవకారుడు పలాకువలెనున్న యీసుందరవిగ్రహము కానేరదని తెల్లబోవుచు నామె తనతో బరిహాసముచేయుచున్నదనియు, తన నట్లవమానింప తగదనియు నామెపై గోపపడుచుండ సావర్కారు లేచివచ్చి యాప్రతినిధికి స్వాగతమునిచ్చెను. ఆతడు కొంచెము కంగారుపడి "సావర్కారెచ్చట?" అని ప్రశ్నించెను. ఆతడు నవ్వుచు 'నేనే సావర్కారును' అనెను. "నీయాకారమును, నీవయస్సును, నీ చేష్టలును, జాలభయంకరముగా నుండునని మేము భావించియుంటిమి." అని యాప్రతినిధి బలికెను. "నేను మీయుద్దేశ్యముల నిట్లు భంగపరచినందులకు నన్ను క్షమింపగోరుచున్నాను." అని సావర్కారు నవ్వుచు నుడివెను. ఆప్రతినిధి పక్కున నవ్వి "మాపత్రికానిర్వాహకులు దా మింతవఱకును దీవ్రముగా ఖండించుచున్నది మీసకక్షినను చిన్నగానేర్పడని బాలనాయకుని కృషిమాత్రమేయుప కలనైనను దలంచుటలేదు" అని చెప్పెను. "జరిగినదానికి వగచిన పనిలేదు. ఇప్పుడు తెలిసినది గనుక నికనైనను వారు నన్నెదుర్కొనుట మానుదురుగాక" యని సావర్కారతనిని మందలించెను.

సావర్కారు ఐర్లండు విప్లవపక్షమువారినిగూడ కలుసుకొని సిన్‌ఫీను యుద్యమరహస్యములను దెలిసికొనెను. అతడు ప్రపంచమంతటను బ్రిటిషుప్రభుత్వవ్యతిరేకులైన ఈజిప్టు, చీనా, ఐర్లండు, భారతదేశము, తుర్కిలలోని విప్లవసంఘముల నన్నింటి నేకముఖమునకు దెచ్చి యన్నిచోట్ల నొకేసారి విప్లవములను లేవదీయుటకు బ్రయత్నములను గావించెను. భారతదేశ మతిదౌర్భాగ్యదేశము. భారతప్రజలు మూఢులు. జ్ఞానశూన్యులు. నాగరికత నెఱుగనివారు. అని ఖండాంతరములలో బ్రచారము చేయబడెను. సావర్కారిట్టిప్రచారమున కెడములేకుండ వ్యాసములను వ్రాయించి యనేకభాషలలోనికి దర్జుమాచేయించి పత్రికలకు పంపుచుండెడివాడు. ఈవిధముగా ఖండాంతరములలోని విద్యాధికప్రపంచములో, దాస్యమున మునిగి స్వతంత్రముకొఱకు పోరాడుచున్న భారతదేశరాజకీయమునం దభినివేశమును, అమోదమును బుట్టించినది సావర్కారు యాజమాన్యమున 1906 మొదలు 1910 వఱకు నాందోళనను జరిపిన యభినవభారతసంఘమే యనుట కెట్టిసందేహమును లేదు.

## నిర్బంధములు.

అభినవభారతసంఘప్రచార మీవిధమున ప్రపంచమంతటను వ్యాప్తి జెందుచుండ భారతదేశముకూడ నిద్రనుండి మేల్కొనెను. మానిక్తొలాబాంబుఫ్యాక్టరీ, బెంగాలులో

పోలీసుయుద్యోగులను, గూఢచారులను జంపివేయుట, తిలక్ పరంజపి మొదలగు నాయకులను నిర్బంధించుట, బొంబాయిలో బ్రిటిషుప్రజలను హత్యగావించుట మొదలగు విపరీతపరిస్థితులు భారతప్రభుత్వమును క్రోధోత్కంఠతలలో ముంచివేసెను. అభినవభారతసంఘముయొక్క రాజకీయ సాహిత్యము నాపివేయుట ప్రభుత్వతరము గాకపోయెను! "ఓ దేశభక్తులారా! మహోపద్రవము! భారతరాజకుమారులారా! నిశ్చయించుకొనుడు!" అను కరపత్రములును, యూరపులో నభినవభారతసంఘమువారిచే ప్రచురింపబడు "వందేమాతరం" "తల్వారు" మొదలగు నగ్నికణములను రాల్చు పత్రికారాజములును భారతదేశములోని కళాశాలలకును, వసతిగృహములకును, క్లబ్బులకును జివరకు సైన్యశిబిరములకును గూడ వచ్చి వర్షించుచుండెను. ప్రభుత్వము వారి నిషేధములు! క్రోధానలములు! పరీక్షలు! ఎన్నియున్ననేమి! మధ్యమధ్య సావర్కారు సిక్కులకు ప్రత్యేకముగా బంపుచుండు కరపత్రము లగ్నిహోత్రపుంజములే!

సావర్కారు సిక్కులపై ప్రత్యేకముగా నొకకన్నువేసియుంచెను. సిక్కులలో ప్రతిగృహమునకును దన ప్రచారమును గొంపోవలెనని సావర్కారు యోచించి గురుముఖిలో ననేకకరపత్రములను బ్రచురించి పంజాబులోని సైనికశిబిరములకు పంపించెను. గొప్పగొప్ప యుత్సవములుగూడ

జరుపబడెను. లండననగరమున గురుగోవిందసింగుయొక్క జన్మదినోత్సవము జరుపబడెను. లజపతిరాయి, బిపినచంద్రపాల్ మొదలగు హిందూనాయకులందఱును గురుగోవిందసింగును కొనియాడిరి. ఆసందర్భములో నతడువ్రాసిన ఖాలసాయను కరపత్రమతియుద్రేకకరముగా నుండెను. ప్రభుత్వమువారు నిషేధించినను గూడ నవి పంజాబులోని పాఠశాలలలోనికిని, వసతిగృహములలోనికిని, గళాశాలలలోనికిని ప్రవేశించెను. సిక్కులనుగురించి ఇతర రాష్ట్రహిందువులకు దెలియుటకు మహారాష్ట్రభాషలో నతడొక సిక్కుచరిత్రను వ్రాసెను. కాని యది ప్రభుత్వహస్తగతమయ్యెను. సిక్కులను జాతీయపక్షమునకు ద్రిప్పుకొనుటే సావర్కారుయొక్క ముఖ్యోద్దేశము. చిట్టచివర కతనియుద్దేశము నెఱవేఱెను. భారతదేశములో సిక్కులలో నంత ప్రబోధము మొట్టమొదట కలుగకపోయినను అమెరికాలోని గదర్ పత్రిక మొదలగు నితరరాజకీయసాహిత్యముల ద్వారమున సిక్కులక్రోధానలము రగుల్కొనెను. కనడాకు వలసపోయిన సిక్కులలోగలిగిన యాందోళనము దీనికి మరింత దోహదమునిచ్చి "కొమగటమారు" వ్యవహారముగా బరిణమించెను. అప్పటినుండియు గదర్ పార్టీకిచెందినసిక్కులు వందలకొలది పంజాబులో నొక విప్లవమును లేవదీయవలెనని భారతదేశమునకు రాజొచ్చిరి. తరువాత నొక మ్యూటినీయును, 1914 లోని తిరుగబాటులును, లా

హోరు బర్మాలలో గదర్ పార్టీవారిపై ప్రభుత్వమువారిచే తేబడిన యభియోగములు ననేకమంది సిక్కుల నురిదీయుటయు, జాలమందిని జన్మాంతరవాసములకు బాపుటయు మొదలగునవి జరిగెను. అప్పటినుంచి నేటివఱకును సిక్కులహృదయము లక్లైరగులుచున్నవి. సావర్కా రింగ్లండునకు పోవునపుడు మహారాష్ట్రదేశములోని యభినవభారతసంఘములను దనపరమమిత్రులైన వారియాజమాన్యమున విడిచివెళ్లెను. త్వరలోనే వారియాందోళన మితిమీరిపోయెను. ప్రభుత్వమువారు దానినెట్లైన నణచివేయుటకు సమకట్టిరి. సావర్కారు బాంబులను, మందుగుండుసామానును, రాజద్రోహమును, బుకలెల్పు సాహిత్యమును నరంతరము వీరికి బంపుచు భారతదేశమంతటను బ్రచారముచేయుచున్నట్లు ప్రభుత్వమువారనుమానపడిరి. సావర్కారు అన్నయగు గణేశసావర్కారును రెండుసార్లు బొంబాయి, నాశికలలో జరిగినహత్యలసందర్భములో నిర్బంధించిరి. నాశిక నొక్కసారి భయపెట్టుటకు మిలిటరీదళమును ప్రదర్శించిరి. కాని నాసిక యంతమాత్రముచే భయకంపితురా లగునది కాదు. “స్వాతంత్ర్యలక్ష్మీకి జై” అను ధ్వనులు దేశమంతటను బిక్కటిల్లెను. తిలకును నిర్బంధించుటతోడనే బొంబాయిలో బ్రిటిషువారిపై దొమ్మీలుసలుపబడెను. వీనిలో నభినవభారతసంఘములోనివా రనేకు లున్నట్లు ప్రభుత్వమువా రనుమానించిరి. గ్వాలియరులోని యభి

నవభారతశాఖ నొకదానిని ప్రభుత్వమువారు కొల్లగొనిరి. అందులో నాయుధములు మొదలగునవి వారికి జిక్కెను. దానితో పది పండ్రెండుగురు దీర్ఘశిక్షలను బొందిరి. తిలకు పరంజపిగార్లను నిర్బంధించినను బ్రజాందోళన తగ్గిపోవుటే కాక నది విప్లవోద్యమనాయకహస్తగతమై దినదినప్రవర్థమానమగుచుండుటను జూచి ప్రభుత్వమువారు ప్రధాననాయకుని బట్టుకొనినగాని లాభము లేదని గణేశసావర్కారునునిర్బంధింప నిశ్చయించిరి. అతడదివరకే యారుమాసములు కఠినశిక్ష ననుభవించి యిప్పుడే బయటకువచ్చెను.

అతడు వీరావేశమును బురికొల్పు నొకగీతమునువ్రాసెను. అదిస్వాతంత్ర్యముకొఱకు బోరాడిన దేశచరిత్రముల నొకటొకటిగా బేర్కొనుచు, బ్రతిపాదము చివరను "భారతీయులారా! యుద్ధము చేయకుండ, భుజబలమును జూపకుండ నేదేశము తనస్వాతంత్ర్యమును సంపాదించుకొనగలిగెను?" అనుపల్లవితో బ్రజలను హెచ్చరించుచుండెను. ఈపుస్తకమును బ్రచురించినందుల కతనిపై 121 సెక్షను (ఎ) ప్రకారమభియోగము తేబడి యావజ్జీవదేశాంతరవాసము విధింపబడెను. ఈవార్త ప్రజలలో పిడుగుపడినట్లు పడెను. భారతదేశమున రాజకీయములలో పాల్గొనుట త్రాచుతో చెలగాటమువంటిదాయెను! వినాయకసావర్కారునకీఘోరవార్త పత్రికలద్వారా తెలిసెను. అభినవభారతసంఘముపై నిదియొక బ్రహ్మాస్త్రప్ర

యోగమని యతడు గ్రహించెను. మానిక్తోలాయభియోగ ములలో విధింపబడిన శిక్షల విషయమై లండనులోని యభి నవభారతసంఘరహస్యకార్యనిర్వాహకవర్గమువా రదివఱకే యాలోచించుకొనుచుండిరి. గణేశసావర్కారుకు విధింపబడిన శిక్షతో, ననగా తన వంశవృక్షముపై ప్రయోగింపబడిన గొడ్డలివేటుతో, విప్లవోద్యమమున కంతకును మూలపురుషు డైన వినాయకసావర్కారుయొక్క యుద్రేకము చల్లారునని యును నతడికనైనను కండ్లుతెరచి రానున్న భయంకరరంగ మును గ్రహించి యుద్యమమును విరమించుకొనునని యు ప్రభుత్వమువా రాశించిరి.

సావర్కారు భారతదేశమునకు తిరిగివచ్చుటకు వీలు లేదు! స్వగృహమును, అన్నదమ్ములను, భార్యాబిడ్డలను, స్వదేశమును, జివరకు బ్రాణమును గూడ త్యజించి యత డెంతకాల ముండగలడు! అని ప్రభుత్వమువా రాశపడిరి! కాని సావర్కా రింతమాత్రముచే భయపడలేదు! వెంటనే యతడు తన వదినెగారికొకపరామర్శను వ్రాసిపంపెను.

—( పరామర్శ. )—

"సోదరీ! నీసోదరుని ప్రణామముల నందుకొనవేడు చున్నాను. నీవు నీపవిత్రప్రేమామృతముచే బాల్యమునందే దివంగతురాలైన నాజనని లేనిలోపమును మఱపించితివి! తల్లివలె నన్ను పెంచి పెద్దవానిని జేసితివి! నీలేఖ నాకప

మితానందమును జేకూర్చినది! నేడుకదా నేను ధన్యుడనైతినని నా కానంద ముప్పతిల్లెను !

విధివిధానానుసార మిట్టి యీశ్వరసేవా భాగ్య మబ్బి నమనవంశము ధన్యతనొందెను !

అరణ్యమునం దనంతకోటిపుష్పరాజము లుదయించు చున్నవి! వికసించుచున్నవి! మ్లానమగుచున్నవి! వాని నెవ రుగణించిరి! ఎవ రాఘ్రాణించిరి! ఎవరు చూడనైనను జూచిరి! కాని యాత్మరక్షణపరార్థియై "తావుల్దప్పె! మూర్ఛవచ్చె శ్రీమం బయ్యెడిన్! నీవేదప్ప నితఃపరంబెఱుగ దండ్రీ! దీను నింగావవే!" అను హాక్రందనముతో నీశ్వరపాదపద్మ సమర్పితగజేంద్రభృంగకుసుమంబు కవికదంబస్తోత్రామృతత్వమును బొందదే !

అట్లే మనదేశమాత—మనతల్లి—దాస్యశృంఖలాబద్ధకృశీభూతాంగియై మన గృహోద్యానమున బ్రవేశించి యొక నవకుసుమము నూడబెఱికి భక్తిపురస్సరముగా నీశ్వర పాదపద్మముల సమర్పించెను !

ఇట్టి యీశ్వరసేవాభాగ్యము కలుగుటేగాక తదర్పితకుసుమమైన మనకుసుమోద్యానముకూడ ధన్యతనొందెను! ఈవనమున మిగిలియున్న పుష్పములుగూడ నిట్లే గ్రసింపబడును గాక ! సమర్పింపబడును గాక ! మ్లానమగును గాక ! దేవతాకుసుమసరములకొఱకు తన కుసుమముల నర్పించిన

కుసుమవన మెన్నటికిని ఫల, పుష్ప భరసమన్విత మయియే యుండును! తల్లీ! దేశమాతా! రమ్ము. మరల మావనమున బ్రవేశింపుము! మాపుష్పచయము నంతను గొంపోయి మహానవరాత్రియుత్సవమునకు హారావళిగా స్వీకరింపుము.

ఆమహానవరాత్ర్యనంతరము, నవహారపరిసమాప్తి యగుటతోడనే యుగ్రస్వరూపి యగు కాళి నిజస్వరూపమును జూపి తనభక్తులకు దిగ్విజయమును జేకూర్చును!

సోదరీ! ధైర్యరాశివలె హిమాచలమువలె నీవే నా కెప్పుడును ధైర్యమును బురికొల్పుచుండెడిదానవు! నీవే నాప్రబోధపాలవెల్లివి. ఈయుత్కృష్టపవిత్రధర్మనిర్వహణము నకు బద్ధకంకణవై మున్ముందు నిలచిన ధీరస్వాంతవు. ఒక ప్రక్క మహర్షులు, సిద్ధులు, వీరాగ్రేసరులు మొదలగు ప్రాచీనభారత ప్రపంచమంతయు మనలను వీక్షించుచున్నది! మరియొకవంక నుదయింపనున్న భావిభారతలోకము తిలకించుచున్నది! ఈదివ్యసాక్షిగణమంతయు "శభాష్, శభాష్" అనునట్లు మన విధ్యుక్తధర్మమును నిర్వహింప నాపరాత్పరుడు మనలకు శక్తిని బ్రసాదించుగాక!"

ఇట్లామె నోదార్చి సావర్కారు తిరుగ ద్విగుణీకృతోత్సాహముతో విప్లవోద్యమమునకు గడంగెను. అత డెన్నిచేయుచున్నను దన విద్యాభ్యాసమం దప్రమత్తుడై యుండుటచే బారిష్టరు పరీక్షలో నుత్తీర్ణుడయ్యెను. కాని ప్రభుత్వము

వారతని నెట్లైన నణచివేయవలెనని యతనిపై నొకయభియోగమును దెచ్చి తా నికముం దెన్నడును రాజద్రోహవ్యవహారములలో బాల్గొనననని వ్రాసియిచ్చినచో ప్రాక్టీసున కనుమతించెదమని తీర్పుచెప్పిరి. అట్లు చేయు టనవసరమనియు తా నెన్నడైన రాజద్రోహము నొనర్చినచో న్యాయస్థానములతనిపై చర్యను దీసికొనవచ్చు ననియు నతడు బదులుచెప్పెను! చివరకు సావర్కా రన్నిపరీక్షలయం దుత్తీర్ణుడైనను రాజకీయకారణములకుగా నతనికి ప్రాక్టీసున కనుమతినీయక యు బారిష్టరుబిరుదును దొలగింపకయు నట్టే యుంచిరి.

## —। మదనలాల్ ఢింగ్రా ।—

ఇంతలో బులిపై పుట్రివచ్చినట్లు కర్జనువిల్లీ యను నాంగ్లేయుని యొక భారతయువకుడు చంపివేసెనను వార్త లండనునగరమునను గాఢనిద్రనుండి మేల్కొలిపెను. నగర మంతయు భయక్రోధములలో మునిగిపోయెను. రైళ్ళలోను, ట్రాముబండ్లలోను, మైదానములలోను, కాఫీహోటళ్ళలోను, ప్రతిచోటను యీవార్త తప్ప మరేదియును వినబడకుండెను. భారతీయులపట్ల నేమి యుపచారము యేమి యనుపాధము గావింపబడెనని వారిట్టి రక్షింపను పద్ధతులకు గడంగుచున్నారు? అని యుద్రేకపూరితులైన యాంగ్లేయులు ప్రశ్నింప జొచ్చిరి. ఆంగ్లవోటరు లెప్పుడును 1857 వ వత్సరము తరువాత భారతదేశవిషయములలో నిట్టి యవ్యాజాను

రాగము జూపింపరైరి! కర్జనువిల్లీని జంపిన హంతకుడు ఢింగ్రా యనియు, స్వేచ్ఛాభారతసంఘసభ్యుడనియు దీని కంతకును మూలపురుషుడు సావర్కారనియు కొన్నిపత్రికలు ప్రకటింపజొచ్చెను. ఖండాంతరములందు గూడ నీయగ్నియే ప్రజ్వరిల్లి భారతవిప్లవోద్యమము ముమ్మరమం దెట్టి భీషణాకారమును దాల్చునో, రేపేవార్త రానున్నదో యని యూరపు అంతయు నుదయాస్తమయ పత్రికలకొఱ కెదురు చూచుచుండెను. కాని యీ యూరపియనుల కంటెను, ఆంగ్లేయులకంటెను గూడ భారతీయుల కలవరమే మరింత హెచ్చయ్యెను. సురేంద్రనాథబెనర్జీ, బిపినుచంద్రపాలు, భావనగిరి, ఆగాఖాను, మొదలగు యోధానయోధులందఱు నీదారుణ చర్యను గర్హించుటలో నాయకత్వమును వహించిరి. ఈ భారతవిఖ్యాతవ్యక్తులన్నియును గలసి వెంటనే లండనులో నొక సభ జరిపిరి. ఢింగ్రాయొక్క తండ్రికూడ తన కుమారుడు జేసినపని చాల నింద్యమనియు, నట్టివానిని బుత్రునిగా బడసినందులకు సిగ్గుపడుచున్నాననియు, లండను కొకతంతి నిచ్చెను. ప్రభుక్రోధానలభీతులై వడవడ వణకనారంభించిన ప్రతిభారతీయుడును రెక్కలు కట్టుకొని, యురుకులెత్తుచు, నాసభలో నాదారుణహంతకుని గర్హించి, తమ ప్రభుభక్తిని నిలుపుకొన దయచేసిరి! విప్లవకారులు గూడ నీహాడావుడి నంతను జూచుచుండిరి. ఢింగ్రాయొక్క యుద్దేశ్యములను

దూషించుచో సభను జరుగకుండ చేయవలెనని వారును సభకు వచ్చిరి. ఆంగ్లేయులు, భారతీయులు, అర్ధాంగ్లజాతి వారు, వేగులవాండ్రు, పోలీసులు, గూఢచారులు మొదలగు వారందఱును సభ నలంకరించిరి. ఉపన్యాసకుని తరువాత నుపన్యాసకు డా దారుణహత్యను, హంతకుని, వాని యుద్దేశ్యములను, విప్లవోద్యమపోషకులను, వారి సిద్ధాంతములను గర్హించెను. వీరిలో బిపినచంద్రపాలుగా రగ్రేసరులైరి. చివరకు ఢింగ్రా గావించిన రాజకీయహత్య నతితీవ్రముగా ఖండించు చు నొకతీర్మాన ముపపాదింపబడి బలపరుపబడెను. అధ్యక్షులవారు దానిని వోటుకు బెట్టుటకు మారుగా తీర్మాన మేకగ్రీవముగా నంగీకరింపబడెనని ప్రకటించెను.

"ఏకగ్రీవముగా నంగీకరింపబడెను." అను మాట అధ్యక్షు డుచ్చరించుచుండగనే "కాదు! కాదు! ఏకగ్రీవముగా కాదు" అను నొక గంభీరకంఠధ్వని వినవచ్చెను! అధ్యక్షు డెట్లైన దాని నణచివేయవలెనని ముఖము చిట్లించుచు "ఏకగ్రీవముగా" నని మరల గర్జించెను. "కాదు! కాదు!" అను ఫిరంగిధ్వని మరల సభామంటపమున బ్రతిధ్వనించెను. ఆగాఖాను భావనగిరిగారలు "ఎవడువాడు? వాడెచ్చట నున్నాడు?" అని సింహనాదము జేసిరి. అర్ధాంగ్లజాతివారు క్రిందకు దుమికిరి! భారతనాయకులు రూక్షవీక్షణములతో నావ్యతిరేకధ్వని నారయజొచ్చిరి! ఎవడువాడు?

వాడెక్కడ నున్నాడు? వాని పేరేమి?" యను నగ్నికణము లను గ్రుక్కు ప్రశ్నావళి ప్రజ్వరిల్లెను. వెంటనే "నేను, నా పేరు సావర్కారు; నే నిచ్చటనున్నాను" అను వీరరవము వినవచ్చెను. దానితో సభామంటప మంతయు దద్దరిల్లెను. "తన్నుడు! లాగుడు! గెంటివేయుడు!" అను కేకలు సభను తుములము చేసెను. కాని యీ సంకులవాతావరణములో నిర్భయముగా నిలచి యొకమూర్తి "ఈతీర్మాన మేకగ్రీవము గా నంగీకరింపబడె నని చెప్పుటకు వీలులేదు! నేను దానికి వ్యతిరేకుడను'' అని యావనోద్ధూతకంఠముతో బలికెను! అతడే సావర్కారు! అతనిని జూచుటతోడనే కొంతమందికి కాళ్లు వణకజొచ్చెను! గుండెలు కొట్టుకొనసాగెను! అత డేమిచేయునో యనుభయ మావరించెను! "తన్నుడు! కొట్టుడు!" అను కలవరము మరల బయలుదేరెను. ఈ గం దరగోళములో నొక యుకేపియను ముందుకు దుమికి సావ ర్కారు ముఖముపై నొకకఠినమైన దెబ్బను గొట్టెను; కంటి సమీపమున నొకగాయము తగిలి సావర్కారుముఖము రక్త సిక్తమయ్యెను. అత డెంతమాత్రమును జలింపక రుధిరస్నాత వదనుడై దక్షిణహస్తమును బైకెత్తి "ఇంతవఱకు జరిగినను గూడ నేను తీర్మానమునకు వ్యతిరేకముగనే వోటు చేయు చున్నాను." అని యుచ్చైస్స్వనమున బలికెను. రుధిరస్నాతు డైన తమ నాయకుని జూచుటతోడనే విప్లవపక్షము వారిలో

నావేశాగ్ని ప్రజ్వరిల్లెను. వెంటనే యొకడు తన రివాల్వరును పైకి తీసెను. కాని సావర్కారు వానిని వారించుటచే నత డూరకుండెను. మరియొకడు లేచి తన దుడ్డుకఱ్ఱతో నాయుకేషియను బుర్రపై నొక్క దెబ్బలాగెను. దానితో నతడు భగ్నశిరస్కుడై మొదలుకూలిన చెట్టువలె నేలగూలెను. ఇంతలో పోలీసువారి రాకయు, భయభ్రాంతులై యటునిటు బరుగులెత్తుచు, నాత్మరక్షణకొఱకై చేయు శ్వేతకాంతా రోదనములును, విప్లవపక్షమువా రాసభనంతను భస్మీపటలము చేయుటకు దెచ్చిరని యూహింపబడిన "హుళక్కి" బాంబులనుండి రక్షించుకొనవలెనని కుర్చీలక్రింద దూరిన తెల్లదొరల బిక్కమొగములును, రంగమునంతను భీభత్సపరచెను. పోలీసువారు సావర్కారును దమవశము చేసికొనిరి. సురేంద్రనాథబెనర్జీ సావర్కారు చేసినదానిలో తప్పేమియు లేదనియు, నతనిని కొట్టుట పిరికితనమనియు గర్హించుచు సభనుండి వెడలిపోయెను. తలుపుకొఱకు దడుము కొనుచు నెవరికివారు పిక్కబలమును జూపింపసాగిరి. సభ చెల్లాచెదరై పోయెను. విప్లవపక్షమువారికే జయముకలిగెను. సావర్కారు నొకగంటమాత్ర మాపి పోలీసువా రతనికి జరిగిన యక్రమమునకు వగచి యతడు కోరుచో నాయుకేషియనును గూడ బంధించెదమని చెప్పిరి. అత డందులకు సమ్మతింపక నతనికి దగిన బహుమతి యిప్పుడే వడ్డీతోసహా ముట్టినదనియు నదియే చాలుననియు జిఱునవ్వుతో బలికెను.

వెంటనే సావర్కారు తన చర్యను సమర్థించుచు క్రైమ్సు పత్రిక కొక లేఖను వ్రాసెను. ఢింగ్రాపై నంతవఱకు నెట్టి విచారణయు జరుపబడలేదనియు, కర్జనుపిల్లీని జంపినవా డతడే యని నిర్ధారణకాలేదనియు, నతని యుద్దేశ్యము రాజకీయమో, లేక స్వకీయమో తెలియలేదనియు, నతడు మతి చెడి చేసెనో లేక బుద్ధిపూర్వకముగనే చేసెనో తేలలేదనియు, నట్టి సందర్భములలో న్యాయస్థానమువారితీర్పును వినకుండగనే యతనిని గర్హించుట న్యాయస్థానహక్కులకే భంగము గల్పించుటయనియు నతడు స్పష్టీకరించి, కనుక తీర్మానమునకు దానొక సవరణ తేవలెననుకొనుచుండ తీర్మానమునే యంగీకరింపజేయుటకు త్వరపడి యప్పుడైన నొక్క వ్యక్తి లేక వోటుతప్ప తీర్మాన మేకగ్రీవముగా నంగీకరింపబడెనని యధ్యక్షుడు బ్రకటించుట న్యాయమైయుండ వారట్లు చేయక కేకలిడుట, బొబ్బలిడుట మొదలగు వికారచేష్టలకు దిగి మతి చెడినట్లు ప్రవర్తించిరనియు నతడు వ్రాసెను. న్యాయస్థానము వారు ఢింగ్రాకేసుకు విచారించి యతనిపై నేరమును మోపునంతవఱకు నతనిని గర్హింపకుండ నాంగ్లేయు లాత్మనిగ్రహమును జూపియుండ భారతీయులే యిట్లేల పిరికితనమును బ్రదర్శించిరో తెలియరాకున్న దనియు నతడు వ్రాసెను. పత్రికలన్నియు సావర్కారు తీసిన సారాంశమును కొనియాడదొడగెను. అతనిని కొట్టిన యురేషియనుగూడ

తన చర్యను సమర్థించుకొనుటకై యొక లేఖను వ్రాసి "బ్రిటిషు తడాఖా"ను జూపించితినని డంబములు కొట్టెను. వెంటనే దానికి ప్రత్యుత్తరముకూడ టైమ్సుపత్రికలో ప్రకటింపబడి "బ్రిటిషుతడాఖాను మొదలంటగూల్చి రక్తపాతము గావించిన హిందూదేశపు దుష్కరర్మను" జ్ఞాపకము చేసికొనవలసినదని హెచ్చరించెను.

ఇంతలో ఢింగ్రాకేసు విచారణకు వచ్చెను. కర్జనువిల్లీని జంపినపుడతనివద్ద తనకుగల కారణములను సూచించునొక కాగితముండెను. దానిని బ్రకటింపుమని యతడు చెప్పినను పోలీసువారు ప్రకటింపకపోయిరి. కొంతమంది యాంగ్లేయులే మతితప్పి తానట్లు చేసితినని చెప్పుమని ఢింగ్రాను వేడుకొనిరి. అతడు దాని కొప్పుకొనక వాదమునే చేయక "తనమాతృదేశదాస్యవిమోచనముకొఱ కాయుధపాణులైరనుమహోద్యమునకు భారతయువకుల నురిదీయుట, దేశాంతరవాసములకు బంపుట మొదలగు దారుణశిక్షలను విధించిన కర్జనువిల్లీపై పగదీర్చుకొనుటకే నేనట్లు చేసితి"నని యొక యుద్రేకమైన గంభీరోపన్యాసము నిచ్చెను. ఈయుపన్యాసము ప్రపంచమంతటను మారుమ్రోగెను. పోలీసువారు మఱుగుపరచిన కాగితముకూడ నతిరహస్యముగా నతివిచిత్రముగా నాంగ్లప్రభుత్వమునకు "సవాలు" అనుపీఠికతో బ్రకటింపబడి ఇంగ్లాండు, అమెరికా, భారతదేశములలో వెదచల్ల

బడెను. అయిన నాంగ్లపత్రికలు మాత్రము దీనిని ప్రకటింప తిరస్కరించెను. దీనికొకపైయెత్తు వన్నబడెను. ఒకదుర్భరం డుస్నేహితుడు సంపాదకునకు దెలియకుండగనే యీ "సవాలు"ను "డైలీన్యూసు" అను పత్రికలో జొప్పించెను. దీనికి పోలీసువారును, బత్రికలును గటకటంబడిరి. మంత్రిమండలములోగూడ నిది చర్చింపబడెననియు లాయిడుజార్జి చర్చిలుగార లిది ప్రపంచములోనున్న దేశభక్తిని బ్రకటించు సాహిత్యములో నత్యుత్తమమైనదని యభినందించిరనియు, రోమకదేశ భక్తాగ్రేసరుల కితడు సరిపోలునని యభిప్రాయ మిచ్చిరనియు లాయిడుజార్జిగారి "స్మరణముల" లో గలదు. సావర్కారుకుగూడ నీహత్యతో సంబంధమున్నట్లు రుజువుచేయుటకు బ్రయత్నములు చేయబడెను గాని యవన్నియు నిష్ఫలమయ్యెను. ధింగ్రా యెంతమాత్రమును చలింపక తనదేశముపట్ల తాను నిర్వహింపవలసిన ధర్మముచే బ్రేరితుడై తానట్లు స్వబుద్ధిచేతనే చేసెననియు, భారతస్వాతంత్ర్యముకొఱకురి సంధము నాశ్లేషించుట కనుజ్ఞ నొసంగవలసినదనియు న్యాయాధికారులను బ్రార్థించెను. చివరకతనిపై మరణశాసనము విధింపబడెను. "హైందవుడగుటచే నేను హిందూస్థానమునందే పుట్టుచు హిందూదేశము తిరుగ తన స్వధర్మ స్వరాజ్య భేరీశంఖములతో మారుమ్రోగుచు మానవకళ్యాణముకొఱకును, భాగవతధర్మముకొఱకును బద్ధకంకణురాలై,

విజయలక్ష్మిని జేపట్టువఱకు నిట్లే జచ్చుచుందునుగాకయని దైవమును ప్రార్థించుచున్నాను." అను మాటలతో నతఁడురి స్తంభము నెక్కెను. అతని నురిదీసిననాడింగ్లండులోనున్న భారతీయు లందఱు నుపవసించిరి. వారందఱును జైలుచుట్టును జేరి ధింగ్రా శవమును హైందవాచారము ననుసరించి దహనసంస్కారముకొఱకిచ్చివేయవలయునని కోరినను నధికారులు దానికి సమ్మతింపక జైలుయావరణలోనే పాతిపెట్టిరి. వెంటనే పోలీసులు, గూఢచారులు, వేగులవాండ్రు, మొదలగు పటాలమంతయు లండనులోనున్న భారతీయులను వెంటాడింపజొచ్చెను. ప్రతియిద్దరు భారతీయులకు నొకగూఢచారి యుండెను. "భారతగృహము" ప్రత్యేకముగా వారి రంగస్థలమయ్యెను.

సావర్కారుబృందముమాత్రి మావంతయు చలింపక తమకృషి ననవరతము సాగించుచునే యుండిరి. కాని పరిస్థితు లంతకంతకు విషమించుచుండెను. పోలీసు లిట్లు భారత యువకులను శనిగ్రహములవలె వెంటాడుచుండుటచే వసతి గృహములలోను, తదితరవ్యక్తుల గృహములలోను వారికి బసలు దొరకకుండెను. విప్లవకారుల బ్రతుకు చాల దుర్ఘటముగ నుండెను. ఇంటివద్దనుండి తల్లిదండ్రులు వారిని గర్హించుచుండిరి. నిర్బంధవదంతులు బయలుదేరెను. "భారతగృహము" మూసివేయబడెను. కాని సావర్కారు చెప్పినట్లు

దానిపని పూర్తియయిన తరువాతగాని యది మూసివేయబ
డలేదు. అప్పటికి భారతీయుడుండు ప్రతిగృహమును "భారత
గృహమే" యయ్యెను. అయినను వారు రాత్రులందు తమ
రహస్యసభలను జరుపుచు "భారతదేశము స్వాతంత్ర్యము
ననుభవింపవలెను. భారతప్రభుత్వము ప్రజాస్వామికము
గావలెను. భారతదేశమున కంతకు నొకభాష వ్యవహారభా
షగా నుండవలెను. ఒకలిపి వ్యవహారలిపిగా నుండవలెను.
ఆభాష హిందీ. ఆలిపి దేవనాగరి. ఆప్రజాస్వామికము అధ్య
క్షుని యధికారముక్రింద నిర్వహింపబడినను ఒకప్రభువు
యధికారమున నిర్వహింపబడినను భారతప్రజలకే తుదియధి
కారమున్న జాతీయప్రభుత్వము" అను తమరాజకీయమంత్ర
ము ననుదినమును గంభీరస్వరమున బునశ్చరణము జేయు
చుండెడివారు—

ఇంగ్లండులో నిట్లు వ్యవహారములు శృతిమించుచుండ
భారతదేశమునగూడ ప్రభుత్వమువారు దారుణనిర్బంధచక్ర
మును సావర్కారుకుటుంబము, స్నేహితులు, పరిచయులు,
సంబంధులు, మొదలగువా రందఱిపైనను బ్రయోగించుచుం
డిరి. అనేక బంధువులను నిర్బంధములపాలుచేసి వారియుద్యో
గములను దీసివేసిరి. పోలీసువారిని వారిపై కాపలాయుంచిరి.
ఎక్కడో అహ్మదాబాదులో మింటోప్రభువుపై బాంబుపడి
నందులకు సావర్కారుతమ్ముడైన 17 వత్సరముల బాలుని

పోలీసు వశపరుచుకొని యూరూరతిప్పి తప్పిదమును బలిమిని ఒప్పింప ప్రియత్నించిరి. ఇంటివద్ద పిన్నవయస్కురాలైన తనవదినెగారొక్కతెయు నేకాకిగా బిక్కుబిక్కుమనుచుండెను. తానింగ్లండులో జిక్కుపడెను. ఇంగ్లండులోని నిరంతర కృషియు నీకష్టపరంపరలును సావర్కారు శరీరారోగ్యమును కుృంగదీసెను. ఏనిమిషమందో నిర్బంధమువచ్చునను వదంతులు బయలుదేరెను. పోలీసుకాపలా మితిమీరెను. అతనికెచ్చటను బస దొరకకుండెను. ఒకనాడతడు రెండుబసల నుండి యజమానులచే పోలీసుభయమువలన తఱుమగొట్టబడి పట్టణమంతయు దిరిగి చివరకు రాత్రి యొకబస చూచుకొని నిద్రపోవుటకు బ్రియత్నించుచుండ యజమాని పరుగెత్తుకొనివచ్చి పోలీసు లప్పుడే తనయింటిని ముట్టడించిరనియు, నితరముసాఫరులు భయభ్రాంతు లగుచున్నారనియు జెప్పి తనయిల్లు విడిచి పొమ్మనెను. అప్పు డత డర్ధరాత్రిమున తన సామాను నొక్కడును భుజముపై వేసుకొని తిరిగి తిరిగి యెట్టకేల కొకజర్మనుస్త్రీయింట బసచేసెను.

ఇట్టి పరిస్థితులలో సావర్కారు విచారగ్రస్తుడై లండనునగరమును విడిచి బ్రైటనుకు పోయి యచ్చట కొద్దివారములుండెను.

## —॥ పారిసు. ॥—

చివరకు సావర్కారు జ్వరపీడితు డయ్యెను. స్నేహితులును, యనుచరులును నతనిని గంటికిరెప్పవలె గాచుచుం

డిరి. వైద్యునిసలహా ననుసరించి వెల్సు అనునొక యారోగ్య స్థానమున కతడు తీసికొని పోబడెను. మంచముపైబడియున్న ను సావర్కారూరకుండ లేదు. అతడు సిక్కులచరిత్రమును వ్రాయనారంభించెను. తల్వారు మొదలగు విప్లవపత్రికలకు వ్యాసములను బంపుచుండెను. వెల్సుకు వెళ్ళినపదిహేను రోజులలో సావర్కారు భయంకరవార్తలను పత్రికలద్వారా తెలిసికొనెను. అనంతకన్హేరు అను నొకచిత్పవనబ్రాహ్మణయువకుడు గణేశసావర్కారుకు దేశాంతరవాసశిక్షను విధించినందులకై నాసిక్‌జిల్లాకలెక్టరైన జాక్సనును జంపివేసెను.

వెంటనే నాసికలోనున్న సావర్కారుస్నేహితులును, మింటో ప్రభువుపై బాంబును విసరెనను మిషపై నిర్బంధింపబడి నేరమేమియును దొరకనికతమున రెండురోజులకిత్రమే విడిచిపెట్టబడిన పదునెనిమిదేండ్లబాలుడైన నారాయణసావర్కారును దిరుగ బట్టుకొనబడిరి. ఇల్లు దిక్కులేక బిక్కుబిక్కుమనుచున్న వదినెగారు తిరుగ నేకాంతవాసము ననుభవింపవలసివచ్చెను! ఇందుపై నాంగ్లపత్రికలన్నియు నిప్పుల నుగ్రక్క మొదలిడెను విప్లవోద్యమమునకంతకును మూలపురుషుడైన సావర్కారింకను ఏలబంధింపబడలేదని పత్రికలు గర్జించుచు నాందోళనను సాగించెను. సావర్కారుస్నేహితులలో భీతికలిగెను. వారతనిని వెంటనే పారిసుకు బోవలసిన

దని బ్రతిమాలుకొనిరి. అచ్చటి నాయకులుగూడ తంతి వార్తలనంపిరి. కాని యతడు వీనిని లెక్కగొనక యుండెను. వెంటనే యభినవభారతకార్యనిర్వాహకవర్గమువారుకూడ నతని యారోగ్యమును, క్షేమమును, దమయుద్యమమునకు బట్టుకొమ్మలనియు, నెట్లైనను వానిని గాపాడుకొనుటయేతన ప్రధానకర్తవ్యమనియు, వెంటనే పారిసుకు పోవుటే తమయభిప్రాయమనియు, తెలియపరచి యతనితో పారిసుకుపోవుట కొక ప్రతినిధినికూడ పంపించిరి.

సావర్కారు వెంటనే లండనుకు వచ్చెను. ఆరాత్రి యొకరహస్యసభ జరుపబడెను. నాయకులందఱు నతని త్యాగమును, యద్భుతచాకచక్యమును, విశుద్ధవర్తనమును గొనియాడిరి. ఇరువదియైదేండ్లు రాకమునుపే ఇంగ్లండులోభోగలాలసులై, కేళీపురుషులై, విషయవిహారులై, సుఖజీవనము నకలవడి, జీవకళలేక నపౌరుషజీవితమును గడుపుచున్న భారతయుత్సవవిగ్రహములను భారతస్వాతంత్ర్యయుద్ధమునకు బద్ధకంకణులై, స్వార్థత్యాగులై, నిరంతరదీక్షావరాయణులై శతఘ్నులకైన నెదురొమ్మునిచ్చు ధీరలక్షణ లక్షితులైన శూరులనుగా దయారుచేసి రెండుప్రభుత్వములను గజగజలాడించిన సావర్కారుయొక్క ధైర్యసాహససంపన్నాదివీర లక్షణములను వారు వేనోళ్ళబొగడిరి. నాసికనువీడిననాడెట్టి విచారము గలిగెనో యట్టివిచారముతోనే యతడు తన వీర వర్గమునువీడి పారిసుకు పయనమయ్యెను.

పారిసులోనున్న భారతీయులందఱు నతని కొకఘనము గు స్వాగతము నొసగిరి. అతనితో విప్లవోద్యమకేంద్రము లండనునుండి పారిసుకు మారెను. 'కామా' యనునొక పారసీకస్త్రీ పారిసులో భారతస్వాతంత్ర్యముకొఱకు పాటుపడు చుండెను. ఆమెకూడ విప్లవోద్యమునజేరి యూరపునందంతటను బ్రచారముచేయుచుండెను. ఒకసారి యామె జర్మను సాంఘికవాదులచే నాహ్వానింపబడి వారిసభలో భారతస్వాతంత్ర్యమును గూర్చి యుపన్యసించుచు నభినవభారతసంఘము తరపున చిత్రింపబడిన త్రివర్ణచిత్రితస్వరాజ్యధ్వజమును బైకెత్తి యాకసమున నెగురవేయుచు "ఇదియే భారతస్వాతంత్ర్యధ్వజము. ఇది యిప్పుడే సృష్టింపబడి భారతదేశభక్తుల రుధిరస్రావముచే బునీతము గావింపబడెను. ఈధ్వజమునకు మీరందఱు నభివందనంబులనొసర్పగోరుచున్నాను" అని గంభీరముగా బలికెను.

కొద్దివారములలోనే సావర్కా రచ్చటనున్న భారతీయులకు నూతనశక్తిని నూతనప్రాణమును బ్రసాదించెను. వారినొకబలమైనసంస్థగా నిర్మించెను; కాని యీపని నెఱవేఱుటతోడనే పుష్కలముగా బనిలేకపోవుటచే నతనికి మనోవిచారముకలిగెను. ఇంగ్లండునకు బ్రతిబోటలోను నూతనవిద్యార్థులు వచ్చుచుండిరి. అచ్చటయుద్యమమంతకంతకు ప్రబలుచుండెను. తాను పారిసులో జిక్కుపడెను. పైగా నాసిక

కేసువిచారణలలో పోలీసువారు పెట్టుచున్న బాధలన్నియు ను ముద్దాయిలవలన వెల్లడియయ్యెను. అనేకవిషాదవార్తలు సావర్కారు చెవికి వినబడుచుండ మిత్రులు, యనుచరులు, సహాధ్యాయులు, సోదరులు మొదలగువారలందఱును దన వలననే రంగములోనికిదిగి తమప్రాణములనుగూడ త్యజించు చుండ వారు జయిళ్ళలోను,నురి స్తంభములమీదను, యేకాం తవాసమునను, గుహలలోను గుందుచుండ తాను పాశ్చా త్యారామసీమయైన పారిసులో కులుకుచుండుటయా! ఇది పౌరుషమా! ప్రతాపమా! యను తలంపు లతనిని వేధించు చుండెను.

> "తే. పౌరుషజ్ఞానకీర్తుల బరగనేని
> వానిసంపద యొకపూటయైన జాలు
> ఉదరపోషణమాత్రి మీయుర్విమీద
> గాకి చిరకాలమున్న నేకార్య మగును."

కాని తాను సురక్షితుడైయుండుటచే భారతస్వాతం త్ర్యసిద్ధి కెక్కుడు పాటుపడ నవకాశమున్నప్పుడు, భారతదే శమునకు పోవుచో విధాయకముగా నిర్బంధింపబడునని రూ ఢియైన వదంతులున్నప్పుడు తానట్లుచేయుట యుక్తమా! తన మిత్రుడు శ్యాంజీకృష్ణవర్మకూడ "నీవు సేనాధిపతివి! సైని కులందఱితోడను నీవగ్నిహోత్రమధ్యమునకు దుముకజనదు" అని నొక్కిచెప్పెను. కాని మొట్టమొదట సైన్యముతోగూడ

నాహవరంగమునకు నుమికి యుద్ధము జేసినపుడుగదా నేను సేనాపతినగుటకు దగినట్లు గుర్తింపబడుట! లేనిచో ప్రతివాడును దమకుతామే గొప్పవారమను నాత్మవంచనచే సేనాధిపతియంతటివారమనుకొని రంగమునకుదూకక వెనుకకు నిలచిపోరా! అప్పుడికపోరునదెవరు? భయవిహ్వలులై రణభీరులైనవారుకూడ నిట్టివాదమునకు గడంగుట సులభముకాదా! యను ననేకచింత లతనికి బాడముచుండెను.

హిందూదేశముపోవుచో దప్పక బంధింబడవచ్చును. ఇంగ్లండులోమాత్ర మట్టియుపద్రవము గాన్పించుటలేదు. అతనిపై నెట్టినేరమును మోపబడియుండలేదు. బ్రిటిషుతీరములకు జేరుచో దాస్యశృంఖలములు వాటంతటవియె పడిపోవునని యాంగ్లేయులు డంబములు కొట్టుచుందురు. కనుక హిందూదేశములోగానిచో విప్లవోద్యమమునకు ఫలప్రదమైన యింగ్లండులో దమయుద్యమము సాగించుకొనవచ్చును. ఇంగ్లండులోనున్న నాయకు లెవరునుగూడ భయభ్రాంతులుగాకుండ నచ్చుటనే యుండ తానొక్కడేల పారిసులో దాగొనవలెను! కొంతమంది విప్లవకారు లప్పుడే యింగ్లండును వీడిపోవలెనని చూచుచున్నారు. తానింగ్లండునకు తిరిగివచ్చుచో వారిలో నట్టి యవినీతి యుండదు. ఉపద్రవములనుండి తప్పించుకొని తానచ్చటనో దాగొనియున్నాడనునింద తన కికనుండజాలదు. అని వేవిధముల తలంచుకొనుచు నత డొకనాటి ప్రాతః

కాలమున విహారార్థమునగరోపాంతమునకుబోయెను. సూర్యు డాకసమున బొడకట్టుచుండెను. ఆకసమంతయు నిర్మలము గానుండెను. విశాలమైనరాజవీధులందు బ్రాణములకు హాయి గొల్పు తరుచ్ఛాయలాప్తబాంధవులవలె శీతలకరస్పందనము జేయుచుండెను. అచ్చటచ్చట జిన్నచిన్న విహారసరస్సులు రజితకాంతుల నీనుచుండెను. రాజహంసలు మందగమనము చేయుచుండెను. నీటిపక్షులు కిలకిలలాడుచుండెను. నల్లకలువలు తలలెత్తి నీటిపై దేలియాడుచుండెను. అచ్చట నొకచోట సావర్కారు రత్నకంబళమునుబోలు పచ్చికబయలులో గొంతసేపు విశ్రమించెను. అతనిచేతిలో నొకభారత వార్తాపత్రిక యుండెను. దానిలో నభినవభారత సభ్యుల మొదటివిచారణ జరిగినట్లును కార్వే మొదలగువారి కురిశిక్ష విధింపబడినట్లును నతడు చూచెను. అతడు దానిని పరల పరీక్షించిచూచెను; కాని తనతమ్ముని పేరందు గాన్పింపలేదు. అది లేక పోవుటకత డాశ్చర్యపడెను. అతడు వెంటనే లేచెను. రాజహంసలింకను ధ్వనిచేయుచుండెను. పిల్లగాలికి నల్లకలువలు తలమెత్తి మెల్ల నాడుచుండెను. మారుతము ప్రాణమిచ్చుచుండెను. అతనికొకశబ్ద మాకాశవాణివలె వినవచ్చెను. "భారతదేశమున యురిస్తంభములక్రింద మ్రగ్గనున్న వారినిజూడుము! నీ వీయుద్యానవనవిహారములను, పిల్లవాయువులను, యిందీవరకాంతులను, రాజహంసలనుజూచి యానందించు

చుందువా! నీస్నేహితులును, నీయనుచరులును, నీసోద
రులును, నీరు లేక, గాలి లేక, వెలుతురు లేక, తిండి లేక,
గుహాలలో పడియుండుచుండ నీ విట్లీయానందము ననుభ
వింపగలవా? ఎంతహాస్యాస్పదము!" ఈదృశ్యము సావర్కా
రు నొక్కసారి కుదిరింగదీసెను; పారిసునగరమున నారామ
సీములందు కాలక్షేపము జేయుచుండు టతనికి బాధనుగా
దోచెను! "నేను రంగమున బ్రవేశింపవలెను; నాయనుచ
రులవలె నేనును బాధలను ద్యజింపవలెను. కేవలము
త్యాగముచేయుటే కాక బాధ ననుభవింపగలననికూడ నేను
చూపవలసియున్నది. నన్ను నిర్బంధించినపుడే నాశక్తి కాన్పిం
చును. భారతస్వాతంత్ర్యముకొఱకు నేను ఖయిదులను, బ్ర
వాసములను, యమబాధలను, జివరకు మృత్యువునుగూడ
నాలింగనము జేయనున్నానని దంభోక్తులను బల్కియుంటిని.
అట్టియగ్నిపరీక్ష కిపుడు తరుణ మాసన్నమైనది. నాయొద్ద పా
ఠములనునేర్చుకొనిన యువకులందఱు నురి స్తంభములపై నె
క్కి తమశపథములను నెగ్గించుకొనిరి. వారికి గురుశ్రేష్ఠు
డను, ఉపదేశికుడను, మార్గదర్శికుడను, మిత్రుడను, నీతిబో
ధకుడను, వేదాంతిని యైననేను తీరములనుదాటి బ్రతికియుం
డిన నింతకంటె మహాద్భుతములను జేయగలుగుదునను వ్యా
జమున నాత్మరక్షణము నొనర్చుకొందునా? నారంగమును
వీడకుండుటే నేను మొట్టమొదట జేయవలసిన యద్భుతకా

ర్యము! ఎన్ని సంకటములు తటస్థించినను ... టిప ధై ర్యముతో నెదుర్కొనుట; ... మొదలైన వానినుండి తప్పించుకొని శత్రువులను వంచించుట; ... చోనన్ని యమబాధలను సహించి చిరకాల ... కారాగార ములో జనిపోవుట; అన్నిగండములను దాటి నేను సురక్షిత ముగా బైకి రాగలిగితినేని సేనాధిపతివలె నప్పుడు నన్ను నేను రక్షించుకొనజూచుట; న్యాయముగును. అట్లు చేయుట నన్ను గాని నాయనుచరులనుగాని ... చేయజాలదు. నేను చనిపోవుదునేని చనిపోవువఱకును భారతస్వాతంత్ర్యము కొఱకు పోరాడుచునే యుందునను వ్రతసాఫల్యము నాకు దక్కును. ఈరోజులలో నవలంబింపబడుచున్న భిక్షుకపద్ధ తులనుండియు రాజకీయదాస్యమునుండియు ప్రజలను రక్షించి వారిలో నూతనోత్తేజమును రగుల్కొల్పగలుగునది యిట్టి దేశభక్తుల రుధిరప్రవాహమే కాని వృథావాదములు గావు! ఆ త్మార్పణము! త్యాగము! కష్టసహిష్ణుత! ఇవియే భారతదేశ మును రక్షింపగలవు. ఏదో పని చేయవలెనను నెపమున జేయ బడు నెన్నిపిరికి వేషములైనను భారత జనములో నూతనవికా సమును నూతనశక్తిని బ్రజ్వలింపజేయజాలవు. నేనే సాహసిం చెదను. నేనే కష్టము లనుభవించెదను. నేనే నాయసువులను మాతృపీఠమున బలియొనర్చెదను. అప్పుడే నే నితరులను గూడ సాహసించుటకును కష్టముల ననుభవించుటకును నిర్బంధింపగలను."

ఇట్లు సావర్కా రాత్మపరీక్షాగ్నితప్తుడై, కృతనిశ్చయుడై యచ్చోటును వీడి స్నేహితుల నొప్పించి లండనుకు బయన మయ్యెను. ఆతనికి పారిసులోని స్నేహితు లందఱును గొప్ప వీడుకోలు నిచ్చిరి. సావర్కారు అసిధారామార్గము ద్రొక్కెను. అతడు పారిసును వీడెను. ఫ్రెన్చి సరిహద్దులను దాటెను. స్టీమరు నెక్కి యింగ్లీషు కాలువనుగూడ గడచి యింగ్లండుతీరమును జేరి లండనుకుబోవు రైలు నెక్కెను. ముందు రానున్న యుపద్రవము నతడు గుర్తింపకపోలేదు. రైలు లండను సమీపమునకు వచ్చుచుండెను. ఇదివఱకెన్నడును లేనట్లతనిని రక్షకభటులు వెంటనంటుచుండిరి. రైలు లండను చేరెను. సావర్కారు తనబండిలోనుండి తొంగిచూచుచుండెను. "అడుగో! అడుగో! ఆతడే సావర్కారు!" అను కేకలు వినవచ్చెను. ఇంతలో గూఢచారపటాల మొకటి యాతనిని సమీపించెను. అతడు రైలు దిగెను. వా రతనిపైబడి గట్టిగాపట్టి బంధించి వారంటును జూపించిరి. అతడు పోలీసువశమున గొంపోబడెను.

వెంటనే లండనునగరమంతటనీవార్త దవానలమువలె బ్రజ్వలించెను. "ఇతరులకు సంభవించినపు డేది వారినిశ్చలదేశభక్తికి నిజమగు నగ్నిపరీక్షయనియు, వారినిరంతరకృషియొక్క మహాప్రసాదమనియు జెప్పుచుంటివో యట్టిదే నేడు నీకును సంభవించెను. నీవునివలె బ్రవర్తించెదవుగాక" అని తన

కుడానే సంబోధించుకొని వెన్నిచ్చి పారెననియు నుపద్రవములకితరులను బురికొల్పి తాను వెనుకనుండెననియు మొదలగు నేరముల నెట్టికత్రువైనను దనపై నిక మోపజాలడను నిశ్చింతతో నత డారాత్రియంతయు గాఢనిద్ర నొందెను.

మరునాడు మేజిస్ట్రేటుకోర్టులో విచారణ జరిగెను. కోర్టుఅంతయు ప్రజలతో నిండిపోయెను. సావర్కారును దీసికొని వచ్చునపుడు హర్షధ్వనులు చెలరేగెను. చివర కాతనిపై యభియోగము తేబడి బ్రిక్స్టనుజయిలులో బంధింపబడెను. జయిలులోనుండగా నతనియనుచరు లతని నెట్లైన రక్షించుట కనేకప్రయత్నములను జేసిరి. ఫ్రెంచి, ఐరిషు, జర్మను, ప్రజలేగాక యూరపు, అమెరికాలలోని ప్రజలందఱును యీకేసు విచారణ యెట్లు పరిణమించునోయని చూచుచుండిరి. పోర్చుగీసు, చీనా, యీజిప్టు, ఐరిషు పత్రికలన్నియును సావర్కారు జీవితమునుగూర్చియు, భారతస్వాతంత్ర్య పోరాటమును గూర్చియు ప్రసిద్ధికెక్కిన వ్యాసములను వ్రాసెను. ఇంగ్లీషుకోర్టు లతనిని ఇంగ్లండునుండి భారతదేశమునకు గొంపోవునట్లు విధించెను. ప్రివీకౌన్సిలు అప్పీలు వృథయయ్యెను. కాని విప్లవపక్షమువారుమాత్రము తమప్రయత్నముల నెంతమాత్రమును విరమింపక విచారణకొఱకు గొప్పనిధిని బోగుచేసి శిక్షతగ్గుటకు సర్వప్రయత్నములను జేయుచుండిరి.

సావర్కారుపై శిక్షవిధింపబడుటతోడనే యతడెట్లో యొకయుత్తరమును దనవదినెగారికి జయిలులోనుండియే పం

పించెను. గతవత్సరముక్రితమే యామెభర్త దేశాంతరవాస శిక్షనొందెను. ఆమె యల్లారుముద్దుగా పెంచి పెద్దవానిని జేసిన నారాయణసావర్కారుకూడ యామెకు దూరమైపోయెను. ఎప్పుడోవచ్చునని తనపై గంపెడాసపెట్టుకొని యామె దినములను గడుపుచుండ జివరకు తను నిర్బంధింపబడుటేగాక యురిస్తంభమునకుగూడ పోవ సిద్ధముగానున్నసంగతి నాధీర స్వాంతకు తెలియజేయుటెట్లు! ఆమెగుండెతాళుటెట్లు? ఎట్లైన నతడు వ్రాయబూని దానికి "నావిల్లు" అని నామకరణమిడెను.

## —( నావిల్లు లేక మనోరథము )—

అది వైశాఖమాసము. పైన గగనవీధియు క్రింద సౌధతలమును షోడశకళాపరిపూర్ణదరహాసితచంద్రకాంతిలో నానందస్నాన మాచరించుచుండెను. చిరంజీవిచే ననుదినము నత్యాదరమున జలకమాడింపబడుచున్న మల్లికామతల్లి పుష్పసౌరభముతో హాయి గొల్పుచుండెను.

వసంతకాలసెలవులకు స్నేహితులును, సహాధ్యాయులును, బరిచయులును, సంబంధులును మనయింట గూడుచుండిరి. ఆయుదార యువకబృందమును కీర్తికాంత వరించియుండెను; వీరకాంత పరమపవిత్రయను దూతికాపరిరంభణములచే వారి నోలలాడించుచుండెను.

వారి హృదయాంతరాళమునుండి ప్రేమ యుప్పొంగుచుండెను. ఉదారాశయములతోను, ధైర్యసాహస కార్యాచ

రణములతోను భరితమైన వాతావరణమునే వారెల్లప్పుడు ను లోగొనుచుండిరి. అచ్చట నున్నతమై, విస్తృతమైన వృక్ష రాజములను సుకుమారలతావల్లభులు పెనగొనియుండెడు ప్రజలందఱు నా యూరామమును 'ధర్మశాల' యని ప్రేమతో బిలుచుచుండెడివారు. నీసుకుమార పల్లవరాగపాణిద్వయ మాహారము నొడ్డించుచుండ భక్ష్యములన్నియును మరింత మధురతరము లగుచుండెడివి. పైన పున్నమచంద్రుడు ముద ముసు గూర్చెడివాడు. స్నేహితులు, కుటుంబములు మొద లగు మనమందఱమును గొంతసేపు దీర్ఘాలోచనలు సలుపుచు గొంతసే పుద్రేకపూరితములైన సంభాషణలలో మునుగుచు చాలకాలము గడుపుచుండెడివారము. ఒకపరి మన మయో ధ్యరాముని వనవాస విషాదచరిత్రమును వినుచుందుము; ఒక సారి యిటలీ స్వాతంత్ర్యకదనోద్రేకసంరంభులమై యుందుము. ఒకతూరి తానాజీ, చిత్తూరు, బాజీ, నానాసాహేబు ప్రభృ తుల యమృతవిజయఘుటికలను గ్రమింగుచుందుము. కన్నీటి ధారలు కాలువలై పారుచుండ దురదృష్టవంతురాలైన మన దేశమాతయొక్క పతనహేతువులను విస్పష్టముగా నార యుచుండుట; ఆమె యొక్క సంపూర్ణమోక్షణముకొఱకతి జాగ్రతతో, వేయికన్నులతో దయారు చేయబడిన వివిధప థకముల సమన్వయము; ఆయొక్క ఖేదములను, దారుణ వ్రణములను జూపి యనేకమంది యువకుల నుదారాశయ

ముల కుద్రేకపరచి, మేలుకొలిపి వారిలో నుత్తేజమును గలిగించుట;—

ఆసంతోషదినములు; ఆమిత్రమండలి; ఆవినీలాకాశము; ఆపున్నమచంద్రుడు; ఆయద్భుతతృష్ణ !; ఆవీరక్రియాకలాపానురక్తి; మనల నందఱ నుద్బోధపరచి విపత్పరంపరల నాలింగన మొనరింపజేసిన యాదివ్యాశయము !

ఇవన్నియు నీస్మృతిపథమునకు వచ్చుచున్నవా ? ఆ పరస్పరశపథములును, ఆపవిత్ర ప్రమాణములును, ఆయప్రతిహతవ్రతములును పరాత్పరుని సైన్యములో దీక్షితులైన యావీరభటావళియు నీకు జ్ఞప్తికి వచ్చుచున్నవా ? బాజీవలె నే యుద్ధముచేసి రణరంగమున వీరశయనము నలంకరింప శపథముబూనిన యువకులును, వారిని బరీక్షించుచు ప్రోత్సాహించుచు రసపుత్ర కన్యకలవలె నాత్మసమర్పణమును సేయబూనిన కన్యకలును జ్ఞప్తికి వచ్చుచున్నారా ?

గ్రుడ్డివారమై మన మీపనికి బూనుకొనలేదు! యుక్తి, చరిత్ర, మానవస్వభావములు అను ప్రదీప్తకాంతిపుంజముల లో పరిశోధించి జీవితమును సార్థకము చేసికొనబూనువారు దానిని సమర్పణచేయువలె మనము సంపూర్ణజ్ఞానముతోనే మన మీదుఃఖములను జేపట్టి యాపరాత్పరు ననుసరించితిమి! ఆశపథములను, ఆప్రమాణములను, ఆదీక్షలను, ఆమిత్రమండలిని, ఆసహచరులను ఒక్కసారి మనోఫలకమున నిలిపి వర్త

మానమును గూడ నొక్కసారి తిలకించుము ! పన్నెండు వత్స రములైనను యింకను జరుగలేదు ! ఎంత పనిని సాధించితిమి! ఈదృశ్యమంతయు జాల ముదావహాముగనే యున్నది !

II

సేతుసీతునగమధ్యస్థదేశమంతయు నొక్కసారి గాఢ నిద్రనుండి మేల్కాంచెను! ఆమె (దేశమాత) ముష్టిచెంబును విడిచిపెట్టి పౌరుషమును జూపెను ! కత్తి ఝళిపించెను ! వేన కువేలు నిశ్చలభక్తు లాపరాత్పరుని సేవించుటకు వచ్చుచు న్నారు ! యజ్ఞకీలలు హావిర్భాగముల కొఱకు భీకరానేక దం దహ్యామాన జిహ్వాలను దెరచుకొని విజృంభించుచున్నవి! య జ్ఞమును బరిసమాప్తినొందించుటకు బద్ధకంకణులైన యోభా రతయువకులారా ! అగ్నిపరీక్షకు సమయ మేతెంచినది ! దుష్టశక్తులను నాశనముచేసి కళ్యాణమును సమకూర్చుటకు ప్రజ్వలించుచున్న యీప్రతాపాగ్నిలో నాహుతియగు ప్రథ మేంధనము లెవరు ? అను నగ్నిపరీక్షను శ్రీరాముడు తన భక్తుల కొసగినపుడు మనవంశము ముందుకు దుమికి "ఇదిగో! మేము సిద్ధముగా నున్నారము ! ప్రజ్వలితజ్వాలలో మమ్ము ప్రథమమున హోమముచేసి కృతార్థులను జేయ ప్రార్థించు చున్నాము !" అని శపథము చేసెను.

"ధర్మరక్షణార్థమై మేము కృషిచేసెదము; దానికొఱ కెన్నిసారులైనను జనిపోయెదము !" అని శపథము బూనితిమి!

"మన మగ్నికీలలలో బ్రవేశించుచున్నాము ! మన ప్రతిజ్ఞలను మనము నిలుపుకొంటిమి." దేశమాతను స్వాతంత్ర్యసింహాసనముపై తిరుగ బ్రతిష్ఠించుట కామె ధ్వజముననే ప్రాణములు పోవువఱకును బోరెదమనిన నాటి ప్రతిజ్ఞలు నెఱవేఱెను! నాయాత్మ తృప్తిజెందినది ! మనలో నున్న స్వార్థము నిట్లు మన కండ్లముందరనే భస్మీపటలము జేయుటకు దగినశక్తి నొసగిన పరాత్పరుడు మనలను ధన్యులను జేసెను ! మనము మన ధర్మమును నెఱవేర్చుచు రణరంగమున గూలితిమి! మన జన్మ తరించినది !

III

తల్లీ ! దేశమాతా! నా యాలోచనల నన్నిటిని నేను నీకే సమర్పించితిని ! నావాక్కును నాయనర్గళవాదనాకౌశలమును నీపాదములకే యానవెట్టితిని ! జననీ ! నావీణియ నిన్నుగురించియే గానముజేసెను. మాతా ! నా లేఖిని నిన్ను గురించియే వ్రాసెను.

నాయారోగ్యమును, నాయైశ్వర్యమును నీపదకమలములందే హోమము జేయబడినవి. కండ్లు కాయలుకాచునట్లు నారాకకై యెదురుచూచుచున్న నాచిన్నారి గృహలక్ష్మి యొక్క విచారకలుషితచూపులుగాని, పసికూనలయొక్క మందస్మితకాంతులు గాని, యేకాకియై, దిక్కులేక బిక్కచిక్కి యుపవసించియున్న నావదినెగారి నిస్సహాయతగాని

నీఘనదుంధుభుల యాహ్వానమునుండి నన్ను మఱలింపజాల వాయెను.

ధైర్యరాశి, ప్రతిజ్ఞాధురంధరుడు, కోమలహృదయుడు, ప్రేమస్వరూపుడు, నాజ్యేష్ఠసోదరుడు నీకొఱకే బలియొసంగబడెను! నాచిన్నతమ్ముడు, సుకుమారగాత్రుడు, అల్లారుబిడ్డడు గూయన్న ననుసరించి యగ్నిజ్వాలలలో బ్రవేశించెను! తల్లీ! ఇక నేను మిగిలితిని! ఇప్పుడు నేనుగూడ నీయూపస్తంభమునకు బంధింపబడిన యజ్ఞపశువును! కాని యిది యొక లెక్కకాదు! మేము సోదరులము మువ్వుర మైతిమి గాని యేడుగురమైనను వారినందఱ నీకొఱకే బలి యొనర్పకుందు నే!

నీధర్మరక్షణ మతిపవిత్రమైనది! అతులమైనది! భనద్ధర్మరక్షణమే భాగవతధర్మరక్షణమని నేను నమ్మియుంటిని! నిన్ను కొల్చుటచే నాపరాత్పరునే కొల్చితినని నే నెఱుగుదును!

ఆమెకు ముప్పదిమూడుకోట్లమంది ముద్దుబిడ్డలు గలరు. కాని ధర్మాగ్రిహోనలదగ్ధులై యామెకొఱ కాత్మసమర్పణ మొనర్చువార లమృతులు! నిత్యజీవులు! కాలరహితులు! మొదలంట నరికివేయబడిన మన వంశవృక్షము మరింత వేళ్లుబారి యమోఘజవసత్త్వముల జేకూర్చుకొని నిత్యఫలపుష్పభరసమన్వితము కాకుండునే!

## IV

ఒకవేళ నది యట్లు విజృంభింపక తదితర నశ్వరముల వలె నశించి విస్మృతిపరాగమున గలసిపోయిన నేమికొదువ! మనము మనశపథములను నిర్వహించితిమి. దుష్టశిక్షణ, శిష్ట విజయములకొఱ కాత్మార్పణ మొనర్చితిమి. మన కదియే చాలును. త్యాగమే విజయము.

తల్లీ! దేశమాతా! మా కా పరాత్పరుడు ప్రసాదించిన సర్వస్వమును బ్రాణములతోసహా నేడు నీకర్పించితిమి. ఇకముందు మాకత డేదేని యొక తృషితము నిచ్చునో దానిని గూడ నీపదకమలములకే యానవెట్టుచున్నాను.

సోదరీ! నీ వీ విధముగ నీతలంపులను బరీక్షించుకొనుచు, విచక్షణ చేకొనుచు మన వంశప్రఖ్యాతిని, సాంప్రదాయములను గాపాడుము.

మన స్వధర్మ నిర్వహణమం దప్రమత్తురాలవై యుండుము.

కైలాసగిరియం దసమానతపశ్చరణము నొనర్చిన యుమాసతియు, కదనరంగోన్ముఖులై బాలస్మితములతో నగ్ని ప్రవేశము నొనరించిన యాచిత్తూరు రసపుత్రి కన్యకలును నీ కాదర్శకాంత లగుదురుగాక! నీవొక వీరాగ్రేసరుని సహధర్మచారిణివి! హైందవనారీమణుల బ్రసిద్ధికెక్కిన యాత్మ బలమును, ధైర్యసాహససంపత్తియు నింకను వారిలో మొక్క

వో లేదనియు, విస్మరింపబడలేదనియు రుజువు చేయునట్లు వీరకాంతచందమున వెలయుదువుగాక !

ఇదియే నీకు నాతుదిపలుకు ! ఇదియే నామనోరథము ! నీకు శుభమగుగాక ! సోదరీ ! నీకు శుభమగుగాక ! నాభార్యకు నాప్రేమను దెలుపుచు నిట్లు వప్పజెప్పుము. గుర్తించవారమై మే మీమార్గమున పడిపోలేదు ; పడిపోవుటలేదు. ఈప్రపంచయాత్రానిర్విఘ్న పరిసమాప్తికొఱకు మృత్యుసానువుల నంటిపోవలెనని యుక్తి, చరిత్ర, మానవస్వభావమును గూడ చాటుచున్నవి. ఈజ్ఞానముతోనే మే మురిస్తంభముల నాలింగనము చేయుచు భగవాను ననుసరించితిమి—

1910 వ వత్సరమున సావర్కా రింగ్లండునుండి భారతదేశమునకు ఖయిదీగా పోవలసిన దినము వచ్చెను. ఆనాడు భారతీయులేమి, ఐరోపీయులేమి యతనికొఱకు విచారింపని వారొక్కరును లేరు. విచారోత్కంఠతలను వెలిబుచ్చు ననేక యుత్తరము లతని కందజేయబడెను. ఖయిదులో నున్నను నత డట్లో వారికొక ప్రత్యుత్తరమును వ్రాసి పంపెను.

“మృదుమధుర స్నేహాలతలచే నెవరి హృదయాబ్జములు బంధింపబడినవో ! మాతృసేవ యనెడి దివ్యసంస్కారముచే నేబంధనమాధుర్య మతిశయించుచుండెనో ! అట్టి స్నేహితులారా ! శుభమగుగాక ! శుభమగుగాక ! దేశమాతకుసుమ

సౌరభప్రబోధమును గావించు సుకుమార వరప్రభాతహిమ బిందువులారా ! శుభమగుగాక ! స్నేహితులారా ! శుభ మగుగాక !

తుంగోత్తుంగయశః ప్రవాహడోలికలలో నూగులాడుచు నొకప్పుడును, జ్వాలాయమాన పర్వతశిఖరముల కాహుతియగుచు నొకప్పుడును, దృశ్యమగుచు నొకప్పుడు, నదృశ్యమగుచు నొకప్పుడును, ఘనులమగుచు నొకప్పుడును, దీనులమగుచు నొకప్పుడును—(కాని యీ సర్వసేనాధిపతి యేపదవియం దాజ్ఞాపించినను దానినే మన విధ్యుక్తధర్మముగా శిరసావహించి పురుషకారమును జూపుచు) నిట్లు భగవదాజ్ఞాపితవిధులను నిర్వహింప మనము పోవుచున్నారము !

ప్రాచ్యనాటకములలో నుపసంహారమును సంజీవనిర్జీవ పాత్రలన్నియు నొక్కసారి నాటకరంగమున దిరుగ కలుసుకొనును ! అట్లే యసంఖ్యాకులమైన మన మందఱము నసమాన మానవలోకసభాస్థలి, గిరిగహ్వరసీనులు గూడ ప్రతిధ్వనించునట్లు కరతాళధ్వనులను జేయుచుండ నమృతచారిత్రకరంగమున గలుసుకొనెదము ! స్నేహితులారా ! అంతదనుక శుభమగుగాక! శుభమగుగాక! నాయస్థు లండమానుదిబ్బలదౌర్భాగ్యతను సూచించుటకోయన విచారకలుషితమై మందమందముగా బ్రవహించు కొండయేటిలో దోయబడినను, తారావళి తమ యర్ధరాత్రినృత్యములను సలుపుచుండు

పవిత్రభాగీరథీస్ఫటిక సలిలములలో నిక్షేపింపబడినను, మరే లోకములో మగ్గుచున్నను, శ్రీరామచంద్రుడు తనభక్తులను విజయలక్ష్మీసింహాసనస్థులను జేసెనను జయభేరీ మ్రోగుట తోడనే సంతోషాతిరేకమున లేచి తాండవమాడును! "దుష్ట శక్తి తన ప్రథమనివాసమైన సముద్రమువఱకును, మరల తరుమగొట్టబడినది! మానవలోకము నుద్ధరించు దివ్యజ్యోతివలె మన భారతమాత వెలుగొందుచున్నది! భారతసామ్రాజ్యముకొఱకు పోరి కూలిన ఓ యోధులారా! ఓ సిద్ధులారా! లెండు! లెండు! మీరు పోరాడి కూలిన సమరమున జయము చేకూరినది!" అను మంగళాచరణము శ్రవణపుటముల బడువఱకును శుభమగుగాక! శుభమగుగాక!

ఇంతకార్యము జరిగినది; లేక ప్రయత్నింపబడెను; అనుగుణకారమును మాని మనప్రజ లిన్నికష్టములను సహించిరి; ఇంత త్యాగమును జూపగలిగిరి; అను త్యాగసూత్రముచే భారతదేశాభివృద్ధిని కంటికి కూరుకు లేకుండ పరీక్షించుటను మనము నేర్చుకొనవలెను. పని జరుగుట సంభవాసంభవములతో గూడుకొని యుండును. త్యాగమట్లు కాదు; అదియొక మూలసిద్ధాంతము. అది యఖండసామ్రాజ్యములను స్థాపించు యమోఘమైన పునాది. కాని దేశభక్తుల యస్థులపై నాపునాదులను నిర్మించినపుడే యాసామ్రాజ్యము లమోఘములగును. భగవదంశము భగవంతున కర్పింప

బడుదుకులును, మీరిదివ్యధర్మములు నెఱవేఱుపటకు నిక్లే మా తృయశోమునకు కోరి యురితాళ్ళనో, విజయసింహాసనము నో సంపాదించుకొనుము."

విప్లవనాయకుడైన సావర్కారును హిందూదేశము నకు సురక్షితముగా తీసికొనిపోవు టెట్లు ? అని ప్రభుత్వము వారును, పోలీసువారును బహుపరివిధముల నాలోచనల జేయు చుండిరి. "అతడసాధారణచక్రవర్తి" ప్రాంసుదేశములో శ్యాంజీకృష్ణవర్మ సావర్కారు నెట్లైన విడిపించుటకు భూమ్యా కాశములను దల్లకిందులు జేయుచుండెను. ఓడ ఫ్రెంచితీర మున జేరుచో సావర్కారు ప్రభుత్వమువారికి దక్కడు. ఓడ మామూలుగా నింగ్లీషుకాలువను దాటి ప్రాన్సుగుండా మార్సీ ల్సుకు జేరి యచ్చటనుంచి భారతదేశమునకు బోవలసియు యున్నది. ఈయుపద్రవమునుండి తప్పించుకొనుటకీమామూలు మార్గమును మానివేసి యింగ్లీషుతీరమునుండియే, విదేశతీర ములకు బోకుండ, బిస్కేజలసంధిగుండ పోవుటకు నిశ్చయిం పబడెను.

భారతదేశమునుండి ప్రత్యేకముగా రప్పింపబడిన జెట్టీ లవంటి గట్టి సిబ్బందితోను, ఆంగ్లదేశములో తయారైన పిడు గులవంటి యుద్యోగులతోను, సావర్కారును భారతదేశము నకు గొంపోవ నిశ్చయింపబడెను.

ఓడ ప్రయాణమును సాగించెను. కాని సావర్కారుర

కుండలేదు. అతడెట్లైనను దప్పించుకొని పారిపోవుటకు మార్గముల నారయుచుండెను.

ఆతడు తనధర్మములను నెఱవేర్చెను. తనరంగమునుండి పారిపోలేదు. సరికదా యత డగ్నిహోత్రమధ్యమునకు దుమికెను. శత్రుమధ్యమునుండి తప్పించుకొనుటే మగతనము. తానట్లు చేయగలిగినచో కష్టములనుండి పలాయనుండయ్యెనను యపవాదరూపు మాయుటేగాక దనయనుచరులలో నెట్టి యవినీతికి నాస్పదములేకుండజేసి యత డింకను మహోత్కృష్టకార్యములను నెఱవేర్చుటకు సావకాశమును గల్పింపగలడు ? తానిట్లు శత్రువులను జయప్రదముగా నోడించినచో విప్లవోద్యమమునకు మరింత వన్నెదెచ్చినవాడై ప్రపంచవాసులనందఱను దనయుద్యమమువైపున కాకర్షించినవాడగును. తాను పారిసునుండి యింగ్లండుకు తిరిగివచ్చుటనుగూర్చి యనేక చిత్రవిచిత్రకథలు బయలుదేరెను. పోలీసువారి మాయలలోబడి తిరిగివచ్చినాడని పోలీసులు డంబములు కొట్టుచుండిరి. అత డెట్లైనను దప్పించుకొనినచో నీడంబములన్నియును బయటపడగలవు. బ్రిక్స్టనుజయిలులోనుండగనే యతనిని తప్పించుటకు బ్రయత్నములు జరిగెను. కాని యవి నిష్ఫలములయ్యెను. అప్పుడతనికి స్నేహితులుండిరి. కావలసినంత ధనసహాయముగూడ కలదు. ఇప్పుడో! ఓడపై తోడునీడలేక, పలుకాడుటకు బక్షియైనను సాధ్యముకానట్లు సిబ్బందీ యెప్పు

డు నతనిని కంటికి రెప్పవలె గాచుచుండ పారిపోవు టెట్లు? బయటకుపోవునప్పుడుకూడ నతనిపై నింగ్లీషుపోలీసులు కావలాయుందురు! ఇక పోవు టెక్కడికి? అత డుపద్రవకారు డనియు, నతనివెనుక చాల బలగము గలదనియు, వారు సర్వమును త్యజించి యతని నెట్లైన గాపాడసాహసులనియు రక్షకభటులకు దెలియును. కనుకనే వారతనిని నిమిషమైనను విడిచిపెట్టక సర్వమును కట్టుదిట్టము చేసికొనిరి. కాని యెన్నియున్న నేమి? సావర్కారు సంకల్పశక్తి కివి పసంకెల లాటంకములు కాలేదు! అత డనేకసారు లతిచమత్కారముగా దప్పించుకొనుటకు బ్రయత్నించెను. కాని యవన్నియు నిష్ఫలములయ్యెను. అతడు విధి కెదురీదుచుండెను. పదిమంది సాయుధపాణులైన సిబ్బంది తన్ను నిరంతరము గాచుకొనియుండ, వందలకొలది యాంగ్లప్రయాణీకులు వారికి మరింత ప్రోత్సాహమును, బలమునుగూర్చుచుండ పలుకాడుటకైనను వీలులేక, నటు నిటు జరుగుటకైనను స్థలములేకుండ స్టీమరుపై నొంటరిగా బంధింపబడిన సావర్కారు తప్పించుకొనజూచుట పిచ్చిచేష్టవలె గాన్పించును! తరంగమున కెదురీదుట ఫలప్రదము కాగలదా?

మొదట స్టీమరు సరిగా భారతదేశమునకే పోవునని జెప్పిరి. కాని జిబ్రాల్టరు దాటుటతోడనే యుది ఫ్రెంచితీరమునకు బోవుచుండెను. సావర్కారు మనసున యాశ లుదయింప

జొచ్చెను. స్నేహితు లెవరైనను వచ్చి తనకు సహాయమొన ర్చెదరని యత డనుకొనెను. స్టీమరు మార్సిలు రేవు జేరెను. కండ్లు చిల్లులుపడున ట్లతడు ఫ్రెంచితీరమువైపుకు జూచినను నతనికొక్క స్నేహితుడును గానరాడయ్యెను ! పోలీసు లతని పై మరింత కాఠిన్యము బూనిరి. అత డెచ్చటకును గదలుటకై నను వీలు లేకుండెను. మలమూత్రవిసర్జనకును, స్నానమున కును మాత్ర మత డొంటరిగా విడిచిపెట్టబడును. అప్పుడుకూడ రక్షకభటులు బయటనుండి వానిని బరీక్షించుచుందురు. వారు పై నుండి యొకభూతద్దముతో లోపలనున్న సావర్కా రేమి చేయుచుండునోయని జూచుచుందురు. ఇట్టి విపరీతపరిస్థితుల లో గూడ సావర్కారు రెండుసారులు పారిపోవుటకు బ్రియ త్నించి విఫలమనోరథుడయ్యెను.

తెల్లవారుచుండెను. ఓడ యిక ఫ్రెంచితీరమును విడిచి పోవలసిన సమయము వచ్చుచుండెను. ఈతీరము దాటిపోవు నేని యికసావర్కారు కెట్టియాశయు నుండజాలదు. కడసారి యవకాశము దాటిపోవుచున్నది. కాని యేమి చేయుట ? ఆంగ్లోద్యోగులిద్దరును నిద్రిపోవుచుండిరి. సిపాయీలుమాత్ర ము కండ్లు తెరచుకొని యతనిని గాచుకొనియుండిరి.

అత డనేకసారులు తనలో దానిట్లు యోచించుకొనెను; "ఇట్టి విషమపరిస్థితులలో సవజయమే నిశ్చయము. వందల కొలది విదేశీయులమధ్య సహాయము చేయుటకొక్క స్నేహి

తుడైన లేక శత్రుగణమధ్యమునుండి స్వేచ్ఛను బడయు టెట్లు? తప్పించుకొనుటలో నపజయమే సంప్రాప్తించిన యెడల నిక నీరక్షకభటులచేతులలో ననుభవింపవలసినయను బాధలను వేఱుగ జెప్పవలయునా? వారివశమునుండిపోజూచి నందులకు వా రుగ్రమూర్తులై రాక్షసావతారములను దాల్చి నన్ను కండకండలుగా జీల్చివేయుదురు." ఇంతవఱకును సావర్కారు తనవిప్లవకలాపము నంత నతిచాకచక్యముతో నడిపించుకొనుచు వచ్చెను. గొప్పనేరములను మోపుట కతనిపై నెట్టిసాక్ష్యమును గాన్పించుటలేదు. పోలీసువారిచే బలవంతముగ నతనియనుచరులనుండి తీసికొనబడిన సాక్ష్యములను జూచినను నతని కేమవత్సరములకన్న శిక్షవిధించుట కవకాశము లేదని గొప్పగొప్ప న్యాయవాదులే తమయభిప్రాయముల నిచ్చిరి. కాని యీతప్పిదము పరిస్థితులను మరింత విషమావస్థకు దీసికొని రాగలదు. "కాని జయించినచో భారతవిప్లవోద్యమపక్షప్రఖ్యాతి ప్రపంచమంతటను మారుమ్రోగును. దీనిని వినుటతోడనే యూరపు విభ్రమజెందును. అభినవ భారతనాయకుని ప్రభుత్వమువారొక యెలుకను బట్టినట్లు మూయుచేసి పట్టుకొనినారనువదంతి నశించును. ఇదియును కేవ్యక్తియు ప్రభుత్వమున కింతటిధనవ్యయమును కలిగించియుండకపోవు టేగాక నాంగ్లప్రభుత్వబుద్ధికుశలత యంతయు నిర్వీర్యమయి యూరపులో నవ్వులపాలుగావలెను. నా కేసహాయమును

లేకున్న నేనొక్కడనే సాహసించెదను. ఇది ప్రాణముల నొడ్డవలసిన సమయము. జయాపజయములచింత నాకేల! భారతస్వాతంత్ర్యరంగమున జివరవఱకును బోరుసలిపితి నను మనస్సంతుష్టియే నాకు జాలును! ఒకవేళ నన్ను పారిపోవుట లో గాల్చిచంపివేయుచో నిక నంతకంటె గావలసినదేమున్నది. అభినవభారతసంఘనాయకుడనైన నే నండమానుదీవులలో గుందుచు కుళ్ళుటకంటెనో లేక యురిస్తంభముపై ప్రాణము గోల్పోవుటకంటెనో యీవిధముగా జావబడుట మహోత్కృష్టము. కనుక నేను సాహసింపవలెను ''

కాని ఓడ యిక పోవలసియున్నది. తెల్లవారనున్నది. ఇదియే సమయము. ఈతరుణము దాటిన నిక నిరుపయోగము.

అతడు రక్షకభటులను బిలిచి బయటికి పోవలయునని జెప్పెను. వారు ప్రధానోద్యోగిని లేపిరి. అతడుగూడ ఖయిదీతోవచ్చెను. సావర్కారు స్నానముచేయుగదిలోనికి బోయెను. ఆగది కొకయద్ద మమర్పబడెను. రక్షకభటులు పైనుండి యతడు లోపలనేమిచేయుచున్నదియు నొకభూతద్దముతో జూచుచుండిరి. సావర్కారుకీసంగతియంతయు దెలియును. అతడటునిటు జూచెను. అందులో నతని కొకరంధ్రము గాన్పించెను. కాని యచ్చటకు బోవుటెట్లు? రక్షకభటు లతనిని పైతానువలె జూచుచున్నారు. అతనియొద్ద నొక యంగరకా

మాత్రమున్నది. దాని నత డాయుద్దమువద్ద నున్న కొంత్యాకు దగిలించెను. అది యుద్దముపై బడి రక్షకభటులదృష్టి కడ్డము వచ్చెను. ఇదే సమయమునుకొని సావర్కారురంధ్రములోనికి దుమికెను. ఈమారుకూడ నతడు తప్పిపోయెను. విఫలమనో రథుడగుటచే లజ్జాభయము లతని విచారమున ముంచివేసెను. కాని యతడు వెంటనే ధైర్యమును దెచ్చుకొని యత "డీతరుణము దాటిన ని కెన్నటికిని సాధ్యపడదు." అని లోలో వ యనుకొని మరల ప్రయత్నించి రంధ్రములోనికి దుమికె ను. ఈసారి రక్షకభటు లదంతయు గనిపెట్టిరి. వెంటనే వారు తలుపుగుంజిరి. కాని సావర్కారు లోపల గడియవేసికొనెను. వారు తలుపులను బగులగొట్టిరి. ఏమిలాభము! సావర్కా రప్పుడే సముద్రములోనికి దుమికెను. రక్షకభటు లతనితో దుముకుటకు సాహసింపలేక పోయిరి. వారు వెంటనే రివా ల్వరులను బేల్చిరి. సావర్కారాచప్పుడు విని నీళ్ళలోమునిగి యీదుకొనిబోవుచుండెను. వెంటనే స్టీమరుమీదనుండిరొడ్డు నకు వంతెన వేయబడెను. ఓడలోనిజనమును, యుద్యోగులు ను గొల్లుమని క్రింద దుటికి నలుదిక్కుల పరుగెత్తవారంభిం చిరి. సావర్కారు కొంతసేపు మునిగి వారికి గాన్పింపకుండ బోవుచుండెను. కొంతసేపు నీటిపై శరవేగమున నీదుకొని బోవుచుండెను. ఇట్లతడు ఫ్రెంచితీరమును జేరెను. కాని తీరమునుండి సముద్రములోని కెత్తైనగోడ కట్టబడెను. ఆగో

డలను దాకినచో ఫ్రెంచితీరములను జేరినట్లే. ఆంగ్లోయోద్యోగులును తదితరులును కేకలువెట్టుచు తరుముకొని వచ్చుచుండుట నతడుచూచి తీరమునకెక్క పాఱిపోవలెనని గోడల కెగబ్రాకెను. కాని మొదటిసారి విఫలమనోరథుడయ్యెను. మిత్రమేలసంఘసభ్యు లందఱును వీరపరిశ్రమలం దారితేరవలెననునొకవిధి యుండెను. ఆవిధిప్రకారము నాయకుడైన సావర్కారుకూడ కొండల నవలీలగా లంఘించుచుండెను. అదియే యిప్పు డతనిని రక్షించెను. అతడు రెండవసారి ప్రయత్నించి తీరముజేరెను. శత్రుపాశములనుండి తప్పించుకొంటిననుజ్ఞాన మతని యావేదనను తగ్గించెను. అతడు ఫ్రాన్సుతీరపుస్వాతంత్ర్యవాయువుల బీల్చెను. అవి వానికి హాయిగొల్పెను! కాని యుద్యోగు లింకను వెనుకనుండి తరుముకొనివచ్చుచునే యున్నారు. "దొంగను పట్టుకొనుడు." "దొంగను పట్టుకొనుడు.'' అని వారు కేకలిడుచు, నట్టహాసముచేయుచు సావర్కారును సమీపించుచుండిరి. మూక యంతకంతకు హెచ్చుచుండెను. ఉద్యోగుల ధోరణి జూచిన ఫ్రెంచితీరమును జేరిన మానవునకు ఫ్రెంచిన్యాయమే వర్తింపవలెనను న్యాయమును గాలి కెగురగొట్టి దౌర్జన్యమును బ్రయోగింపనున్నారని యతడు గ్రహించెను. శత్రువు లతనిని మూడు వైపులనుండి ముట్టడించుచుండిరి. అతడు జివరవఱకు బోరినగాని లాభము లేదని గ్రహించి ఫ్రెంచిపోలీసు లెచ్చటనైనను

గాన్పింతురేమోయని యిటునటుజూచెను. ఒక్కఁడునుగాన్పిం పఁడేరి! సముద్రప్రతీత; గోడలకెగఁబ్రాకుట; మృత్యుదంష్ట్రా కరాళమునుండి తప్పించుకొను సాహసకార్యములలో నుండు గుండెదిడ ; మొదలగు నన్నింటివేళ నెంతయలసియున్నను క్రూరమృగపంక్తిచే దరుమబడు లేడివలె నతఁడు రివ్వునఁబరు వెత్తజొచ్చెను ఇట్లతఁడొక మైలుదూరమువఱకు బరుగెత్తెను. ట్రాముబండ్లు పోవుచుండెను. అతఁడు వాటిని సమీపించెను. కాని యేమిలాభము ! ఒక్కస్నేహితుఁడైనను కాన్పింపలేఁడు! అతనివద్ద నొక్కపైసయైనను లేకుండెను. ఒక్క పెన్నియు న్నచో నతఁడు శత్రుపంక్తుల జాలదూరమున నుండగనే ట్రా మూలో నెక్కి యుడాయించెడివాఁడు! ఒక్కపెన్ని! ఒక్క పెన్ని! సావర్కారును రక్షించుటకొరకు పెన్ని చాలును! కాని ఆపెన్ని నిచ్చువారెవరు! మాతృదేశమును, దనప్రజ లను పీడి, దేశముకాని దేశములో ననేక వేల మైళ్లదూరమున నాయుధపాణులైన విదేశీయులచే దన మాతృదేశశృంఖలావి చ్ఛేదనముకొఱకు నాతఁడొనర్చిన మహాపరాధమున కమ మృగ ములచే వేటాడబడు హరిణశాబకమువలె వేటాడబడుచున్న యీభారతయువకున కొక్కపెన్ని నిచ్చువారెవరు! ఒక్కఁడు ను గాన్పింపఁడు !

కొంతమంది ఫ్రెంచికూలీలు దమతమపనులకు బోవు చుండిరి. "దొంగను పట్టుకొనుఁడు" "దొంగను పట్టుకొను

డు” అను కేకలు వారికి వినిపించెను. చింకిగుడ్డలను ధరించిన యొకయువకుని రజిత, స్వర్ణధారులైన నాంగ్లోద్యోగులు దరుముకువచ్చుటను జూచి యతడొకస్త్రీమరులాస్కారయి యుండుననియు, నేదియో తస్కరించి పారిపోవు చున్నాడనియు వారు తలంచి తాముకూడ వానిని దరుమనారంభించిరి. కాని సావర్కారు లేడివలె పరుగెత్తుచు “పోలీసు” “పోలీసు” అని బిగ్గరగా కేకలిడెను. ఫ్రెంచియధికారులచేతులలో బడకుండగనే తన్ను బలవంతముగా నెత్తుకొనిపోవలెనని యాంగ్లాధికారు లాశించుచున్నట్లు సావర్కారు కనిపెట్టెను. ఇంతలో నొకఫ్రెంచిపోలీసు సావర్కారుకు గానప్పించెను. సావర్కారు వానిని సమీపించి తాను దొంగకాననియు, తానొకభారతరాజకీయఖైదీయనియు, ఫ్రెంచితీరమును జేరుటతోనే యతడు స్వతంత్రుడయ్యెననియు, నాంగ్లోద్యోగులతనిని బలవంతముగా నిర్బంధించి తీసికొని పోజూచుచున్నారనియు, వెంటనే తన నొకమేజస్ట్రీటునొద్దకు తీసికొని పోవలసినదనియు వచ్చియు రాని ఫ్రెంచిభాషలో నతనికి జెప్పెను. ఆమామూలువీధిపోలీసున కింతపరిజ్ఞాన మెక్కడగలదు! ఇవేవియును వాని కర్థముకాలేదు! ఇంతలో నాంగ్లోద్యోగులు వచ్చి సందేహించుచున్న యాపోలీసువానిపై వెండి, బంగారములను గుప్పిరి. దానితో పోలీసు కన్నిసందేహములును పోయి సావర్కారు నాంగ్లాధికారులకు నప్పగించెను. కాని

సావర్కారుమాత్రము సాధారణముగా లొంగువాడుకాడు. అతడు వారి నందఱను ధిక్కరించి చివరవఱకును బోరుచు బలవంతముగా డజనులకొలది మనుష్యులుబట్టి స్టీమరులోనికి లాగుకొనిపోవువఱకును బోరుచునేయుండెను. ఇంతలో నొక యుద్యోగి వెనుకనుండి సావర్కారునెత్తిమీద నొకవ్రేటు వేసెను. అతడు రివ్వున సింహమువలె వానిపైకురికి "ఏమి జరిగినను జరుగునుగాక మీలో నొక్కరినైనను బలిపుచ్చుకొనినగాని నేను జచ్చువాడనుగాను" అని గర్జించెను. అంతటితో నధికారుల దుర్నయములు కొంతవఱకు శాంతి జెందెను.

సావర్కారు మరల బంధింపబడెను. అతడు పూర్తిగా నలసిపోయెను; నోట మాటరాకుండెను; ఊపిరి తిరుగకుండెను; క్షయవ్యాధి మరల తలయెత్తునట్లు కాన్పించెను; అపజయమువలన గొంత మనోవేదన గలిగెను; తనలో ధర్మచ్యుతి సంభవించు నను భయము దోచెను; తమ్ము బెట్టినబాధలకు పగదీర్చుకొందుమని యధికారులు బెదరించుచుండిరి. స్టీమరు సాగుచుండెను; పారిపోవలె ననెడుయాశలన్నియు వృథయయ్యెను; రాత్రిపడెను. రేయింబవలు లతనికి సంకెలలు వేయబడెను. బయటకు బోవునపుడుగూడ వా రతనిని రెండుప్రక్కలను బట్టుకొనియుండెడివారు. నాలుగడుగుల గదిలో నతడు కూర్చొనవలెను; నిలువవలెను; యిటునటు

దిరుగాడవలెను; సూర్యరశ్మికూడ యతనికి గఅవయ్యెను; అధికారులు క్రోధానలములను గ్రక్కుచు, దూషించుచు భయపెట్టుచుండిరి. ఒకకత్తి యతనియెదుట వ్రేలాడగట్టబడెను. అతని సమీపముననున్న నొకకొయ్యపై దట్టింపబడిన రివాల్వరుతో నొకషరాయి సిద్ధముగా నుంచబడెను. ప్రయాణికులందఱు నచ్చోటును వీడి యారాత్రి మఱియొకచోటునకు బోజొచ్చిరి; అధికారులు చేయనున్న దుండగముల కివి సూచనలని సావర్కారు గ్రహించి రానున్న విపత్తునకు సిద్ధపడి యుండెను.

రాత్రియంతయు సావర్కారు మేల్కానియే యుండెను; కాని కండ్లుమాత్రము మూతలువడుచుండెను. ఒక యధికారి సావర్కారుపై రూక్షవీక్షణములను బరపి "ఈసావర్కారుజాతి మెట్టిజాతియోకదా" యని హుంకరించెను. సావర్కారు కన్నులవిప్పి చూచి యూరకుండెను. ఊరకుండుటచే నతడు లొంగిపోయెనని యధికారి భ్రమపడి. తిట్టట ప్రారంభించి యమబాధలకు పాల్జేసెదమని భయపెట్టెను. సావర్కారు చటాలున లేచి యిట్లనెను. "చంపెదము, పొడిచెదము అను పెద్దపెద్ద కబుర్లు చెప్పవద్దు. విప్లవ మని మీరు పిలుచునట్టి యుద్యమము నేనాడు నేను ప్రారంభించితినో యానాడే మొట్టమొదట నాకొంపనంటించుకొని నాచుట్టుప్రక్కల నున్నవారి కొంపలను గూడ న

టింప నారంభించితిని. ప్రాణములతో నున్నను నామస్తకము నే నిపుడు జప్తిచేయున్నాను. ముందు వెనుకల నారయని సాహసమే నాకిప్పుడు పరమమిత్రము. మీ విషయము మాత్ర మట్లుగాదు. మీరింకను జాలకాలము జీవించి పుత్ర, మిత్ర, కళత్రాదులతోడను, ధనకనక వస్తువాహనములతోడను బ్రతుక దలచుకొనిరి. కనుక మీరు నాకెట్టి యపచారమును గావింపబూనినను బాగుగ నాలోచించి చేయగోరుచున్నాను. మీయందరితో నేనొక్కడను బోరాడజాలనని నేనెఱుగుదు ను. కాని యిదిమాత్రము ముమ్మాటికిని సత్యము. మీలో నొక్కరి నైనను గడతేర్చక గాని నేను మీచే జప్తువాడను గాను" అని చెప్పుటేగాక అవసరమైనచో నవమెకుట వ్రేల గట్టబడిన షరాయిలో దక్కింపబడియున్న రివాల్వరును లాగి తన శత్రువులపై నురుకుటకు కృతనిశ్చయుడయ్యెను. సావ ర్కారు పెదవులనుండి యీయగ్నికణములు రాలుటతోడనే కుక్కిన పేనువలె కిక్కురుమనకుండ యూరకుండుటయేగాక నాయధికారి వినమ్రుడై సావర్కారు నిట్లు బ్రతిమాలుకొ నెను. "నేను తిట్లుతిట్టు స్వభావము గలవాడను గాను. ఈ యన్నిరోజులనుండియు నేను మీయెడ చాలగౌరవముగనే ప్రవర్తించితిని. కాని నాకిట్టిసంకటములను తెచ్చిపెట్టుట మీకు న్యాయమైన పనిగాదు! మీరు నాయుద్యోగమును బోగొట్టి నాభార్యాబిడ్డల నోటియన్నమును బడగొట్టిరి! నా

పొట్టపై గొట్టుటచే నేను విచారగ్రస్తుడనై కడుపుమంటచే తొందరపడి తూలుమాటలను జారవిడిచినమాట సత్యమే!''

అంతటనుంచి యధికారులు దౌర్జన్యమును దలపెట్టుట మానివేసిరి. వ్రేలాడగట్టబడిన కత్తి మాయమయ్యెను. పరిస్థితులన్నియు నిమిషములో మారిపోయెను. ప్రభుత్వహ స్తములనుండి తప్పించుకొనుటయు తన యద్భుతసాహస కార్యము ప్రపంచమంతటను మారుమోగి భారత రాజకీయములు ప్రపంచసమస్యగా మారుటయు జరుగునని వసార్కారాశించెను. చివరకీ రెండును గూడ నిష్ఫలములైన ట్లతడు తలంచెను. స్టీమరు ఏడెను జేరుసమయమున సముద్ర మల్లకల్లోలముగా నుండెను. అతనిలో కొంతయాశ యుదయింప నతడు సముద్రు నిట్లు ప్రార్థించెను స్టీమరు కొట్టుకొనుచుండెను. ఉష్ణ మధికమగుచుండెను. జీవితము భారముగా కాన్పించెను. ఇక జీవించుట నిష్ప్రయోజనము. విజయధ్వానములచే విరిగిపడు శత్రురథచక్రముల నలంకరించుటకు నేనొల్లను! మృత్యువా! రమ్ము! సంద్రమా! లెమ్ము! నీ యమోఘతరంగముల యాలింగనభాగ్యము నాకు బ్రసాదింపుము! నాతీరములకు గొంపొమ్మని నిన్ను నేనొకసారి ప్రార్థించితిని. నీవు నావిన్నపముల నాలకించితివి. కాని యది మరింత సంకటప్రాయమయ్యెను! కనుక నిప్పుడు చనిపోవుట కైనను నాకు దోడ్పడుము. నీయుగ్రస్వరూపమును నా కొ

క్కసారి చూపి నన్ను నీకడుపున దాచుకొమ్ము! ఈవిధము గానైన నష్టపడి నన్ను చెరబెట్టి హింసింపుచు నాపై బగ దీర్చుకొనుటచే దనివి జెందవలెనని యూటలూరుచున్న నా శత్రువునుండి కాపాడుము!''

చివరకు స్టీమరు బొంబాయిచేరెను. చేతులకు సంకెలలను తగిలిచ్చి, పిచ్చుకత్తులు బారులువెట్టి సావర్కారును క్రిందకుదింపిరి. వెంటనే మోటారులోనెక్కించి యతనినొక రైలుబండిలో తలుపులు, కిటికీలు బిగించి నాశికకు దీసికొనిపోయిరి. కేసు అగువఱకు నతనిని నాసికజెయిలులో నుంచిరి; మోకులతో జేతులకుగట్టి రక్షకభటు లతనిని నాసికవీధులలో ప్రజలందఱును జూచునట్లు త్రిప్పిరి. అతినమ్మకమైన రక్షకభటులను మాత్రమే కాపుంచిరి. సావర్కారుయొక్క సాహసకార్య మప్పుడే ప్రపంచమంతటను మారుమ్రోగెను. అతని ధైర్యస్థైర్యములను బ్రతివారును గొనియాడజొచ్చిరి. ఫ్రెంచిప్రభుత్వమువారు సావర్కారును దమకు తిరిగి వప్పజెప్పవలెనని యాంగ్లప్రభుత్వమునకు ఫర్మానానంపిరి. ఎంత కాపలాయున్నను జయిలులోనున్న సావర్కారున కీవార్తలన్నియు నెప్పటికప్పుడు వచ్చుచుండెను. మాజినీ గారిబాల్డిలకు దలదాచుకొనుటకు జోటిచ్చితిమనియు రాజకీయస్వాతంత్ర్యముకొఱకు బోరాడు నస్వతంత్రజాతులను రక్షించుటకు వీరకంకణమునుదాల్చిన జగజట్టీలమనియు బీరములను

గొట్టు యాంగ్లరాజనీతి తన నిరంకుశప్రభుత్వపదతాడనములనుండి రక్షించుకొనజూచుచున్న భారతదేశసమస్య వచ్చినపు డిట్లు 'పిల్లిమంత్రములను' గొట్టి యంతర్జాతీయ ధర్మములను విడనాడుటచే యూరపు, అమెరికాలలో నగుబాటుకాజొచ్చెను. చీనా మొదలు ఈజిప్టువఱకును ప్రపంచమంతయు సావర్కారుజీవితములతోను చర్యలతోను ప్రతిధ్వనించెను. ఎచ్చటజూచినను సావర్కారుపటము లే. అతనిని మాజినీ, కసూతు మొదలగు వీరులతో బోల్చుచు ఫ్రాన్సులోనున్న పత్రికలన్నియు నతని నెట్లైన ఫ్రాన్సునకు దిరుగ రప్పించుటకు విశ్వప్రయత్నములను జేసెను. కాని ఫ్రాన్సు జర్మనీలమధ్య వైరము పొసగు ననుభయముచే నింగ్లండుతో గూడ నీకారణముచే నిట్టిసమయమున వైరము తెచ్చుకొనుటకు జంకి ఫ్రాన్సు అంతర్జాతీయసభయైన హేగుసభ కీవిషయమును విడచివేసెను. విప్లవనాయకులు కొందఱు హేగుసభకుపోయి భారతదేశసమస్య నన్నిజాతులవారికి తెలుపరచిరి. జయిలులోనుండియే సావర్కారుపంపించిన వ్రాతమూలము హేగుసభలో పంచిపెట్టబడెను.

ఈవార్తలన్నియు సావర్కారుకు దెలియుచుండెను. "ఇప్పటికి నేను ధన్యుడనైతిని! నావిడుదలవిషయమై నా కెట్టిచింతయు లేదు. కష్టములను మృత్యువునుగూడ నేనే కోరుకొంటిని. నే నాయన్నింటికిని సిద్ధముగనేయున్నాడను.

కాని నానిర్బంధ మాంగ్లప్రభుత్వమును గజగజలాడించి నాయభినవభారతసంఘాధ్యక్షపదవిని సార్థకము జేసినదని నేనెంతయో గర్వపడుచున్నాను. శెభాష్! ఇటాలియను, రషియను విప్లవనాయకుల సాంప్రదాయమునకిది యెంతమాత్రము ను దీసిపోవునది కాదు! నాయాత్మ శాంతించినది" అని యతడు గర్వపడెను.

సావర్కారును భారతదేశమునకు దీసికొనివచ్చిన యుద్యోగి పదవి తగ్గించివేయబడెను; ఫ్రెంచిపోలీసువానికి జయిలు ప్రాప్తమయ్యెను. భారతదేశములో విప్లవోద్యమము నణచివేయుటకు ప్రత్యేకఆక్టు తయారుచేయబడెను. దానికపీలు లేదు; జ్యూరీ లేదు.

ఇట్టికట్టుదిట్టములలో మూలసిద్ధాంతములు గాలి కెగరగొట్టబడి సావర్కారు మొదలగువారి నేరములు విచారింపబడెను. సావర్కారు నన్నివైపులను మూసివేయబడిన మోటారులో హైకోర్టుకు తీసికొనివచ్చిరి. అతడు ఖయిదీలను విచారణచేయు రంగస్థలమునెక్కుటతోడనే వార్తాధ్వనులు చెలరేగెను. గాలరీలలోను వసారాలలోను ఒక్కపిట్టయైన లేకుండ ఖాళీచేయబడెను. కాని ముప్పది నలుబది మంది యువకు లతనికి స్వాగతము నొసంగిరి. వారుగూడ నతనితోడి ముద్దాయిలే! వారును పడరానిపాట్లను బడిరి! అనేక హింసలకు లోనైరి! సావర్కారు పరిచయులో బంధుగులో

లేక మిత్రులో యగుచో వారుగావించిన మహాపరాధము. ఎట్టులైన వారినుండి సావర్కారుపై నేరములను లాగవలెనని సర్వప్రయత్నములును జరుపబడుచుండెను. ఇట్టిస్థితిలోకూడ సావర్కారును జూచుటతోడనే వారిశరీరము లుప్పొంగెను. సావర్కారు ప్రజానాయకుడు. వేనకువేలు ప్రజ లతనిని యూరేగింపులతోను, భజనలతోను, యుత్సవములతోను బ్రహ్మరథమునుబట్టిరి. కాని యాయన్నింటికంటె నీయువకబృంద మిచ్చిన స్వాగతముచే నత డానందపరవశుడయ్యెను. ఆయువకులలో నారాయణసావర్కారు గూడ నుండెను! నాలుగేండ్లక్రితము పదిహేనువత్సరముల బాలుని సావర్కారు విడిచివెళ్ళెను. సావర్కారు వాని నానవాలు బట్టగలడో లేడో యని పరీక్షించుటకు వా రతని నితరులతో గలిపివేసిరి. సావర్కారు వానిని మొదట నానవాలుపట్టజాలక స్నేహితులందఱును దమలోదాము నవ్వుకొనుచుండ గొంతసేపటికి గుర్తుపట్టెను.

ఇంతలో కేసు విచారణ ప్రారంభమయ్యెను. సావర్కారు విచారణలో బాల్గొన నిరాకరించెను. తా నెట్టితప్పిదమును జేయకపోయినను దాను ఫ్రెంచిన్యాయముక్రింద నుండెననియు, నంతర్జాతీయధర్మములను తుంగలో నూరద్రొక్కి తన్ను బలవంతముగా దీసికొనివచ్చుటచే దా నీజబర్దస్తీవ్యవహారములో బాల్గొనజాలననియు నతడు స్పష్టపరచెను.

భారతదేశములోని యాంగ్లాధిపత్యమును దా నంగీకరింపజాల నని చెప్పి యాతఁ డూరకుండెను. ప్రాణముమీఁదకువచ్చు విషయములు చర్చకు వచ్చుచున్నను సావర్కారు మాట్లాడక తనస్నేహితులపై వచ్చునేరములకొఱకు కాతురతపడుచు, విషయములను వ్రాసికొనుచు, క్రాసుపరీక్షలకు దయారు చేయుచు, యమబాధలనుపెట్టి తప్పిదములను లాగికొనిరని చెప్పినవారిని వానినన్నింటిని తగ్గించుకొనుఁడని హెచ్చరించుచు తానట్టి క్రాసుపరీక్షను జేయక తనదీక్షనే పాటించెను.

సావర్కారు భారతదేశమునకు వందలకొలది రివాల్వరుకట్టల నెట్లు రహస్యముగా బంపించెనో, అందుల కెట్టి మహోపాయములు పన్నబడెనో, వేగులవాండ్రు, ఓడరేవులలోని సుంకములను వసూలుజేయు నధికారులు మొదలగు వారి కండ్లముందరనే వీనిని దీసికొనిపోయిన ధీరులెట్టివారో, మహారాష్ట్రము, బంగాళము మొదలగు రాష్ట్రములలో బాంబుఫ్యాక్టరీ లెట్లుస్థాపింపబడినవో, కన్యకలుగూడనొక్కొకపుడెట్లు బాంబులుమొదలగు ప్రేలుడుసామానును దీసికొనిపోయి దాచుచుండెడివారో, కన్యకల రహస్యసంఘములు గూడ నీయోధులసంఘములతో గలసి యెట్లుపనిచేసెనో మొదలగు ననేక రహస్యములు బహిర్గతము గావింపబడెను. ఒకమూల విచారణ జరుగుచుండగ నేరక్షకభటులు మాట్లాడ

కూడదని వారించుచున్నను వారు విప్లవప్రచారమునుగూర్చి తములోదాము జర్చించుకొనుచుండిరి. సావర్కారిదివఱకభిన వభారతసంఘసభ్యులు కానివారినందఱ నాశిబిరములో జే ర్చుకొనుచు విప్లవసిద్ధాంతములను వారి కెఱుకబరచు చుండెను !

తీర్పుచెప్పవలసిన దినమువచ్చెను ; నలువదిమంది ముద్దాయిలు కిలకిలలాడుచు దములో దా మెకసక్కెములాడు కొనుచు "నేటియుత్యపరీక్షలో" ను త్తీర్ణులగువా రెవరాయని తర్కించుకొనుచుండిరి. యావజ్జీవదేశాంతరవాసశిక్షను సం పాదించుకొనువాడు 'మొదటితరగతి'లో ను త్తీర్ణుడనియు, ద క్కువశిక్షలవారు 'రెండవతరగతి' మొదలగు తక్కువతరగతి యనియు నంగీకరింపబడెను. ఏమియు శిక్షపడనివారు పరీక్ష తప్పిన ముద్దాయిలు ! మొట్టమొదట నాయకుడైన సావ ర్కారుకు దేశాంతరవాసము విధింపబడెను. సావర్కారు లేచి'వందేమాతరం' అను యాహ్వానముతో దానిని శిర సావహించెను. ఇట్లు దేశాంతరవాసములు కఠినశిక్షలు మొదలగునవి వరుసగా విధింపబడెను.

వెంటనే రక్షకభటులు ఖైదీలపైబడి సావర్కారు చే తులకు సంకెలలను దగిల్చి తీసికొనిపోవుచుండ నతడు తన టోపీని విసరుచు నిక యీజన్మలో కలుసుకొనుట కవకాశ ము లేనితన భటావళినుండి కడసారిసెలవు గైకొనెను !

—॥ తీర్పులోని కొన్ని సారాంశములు. ॥—

1906 లో పూనా, నాసికలలో స్వాతంత్ర్యావేశమును ప్రజలలో గలుగజేయుటకును, విదేశప్రభుత్వముపై ద్వేషమును కలుగఁజేయుటకును సావర్కారుపన్యాసముల నిచ్చుచు, మానసికశిక్షణమువలనను, శారీరకపరిశ్రమల వలనను విప్లవమును విజయప్రదము గావింపవచ్చునని ప్రచారముచేయుట—

1909 లో జాక్సనుహత్య జరిగినతరువాత గణేశసావర్కారింటిని సోదాచేసినపుడు 1776-1876 లలోని యూరోపియను విప్లవములనాటి రహస్యసంఘములనుగూర్చి ఫ్రాస్టు వ్రాసిన ప్రతియొకటి దొరకెను. అందులో రష్యనువిప్లవకారులెట్లు రహస్యముగా చిన్నచిన్న మండలములను స్థాపించిరో, ఆమండలములన్నియు నెట్లు ప్రత్యేకభాగములుగా విభజింపబడినవో, ఆమండలములోని సభ్యులామండలము వారికేగాని యితరులకు తెలియకుండ నెట్లుండెడివారో మొదలగు విషయములు కలవు దీనినిబట్టి ఇట్టిసంఘము లనేకము లేర్పడినట్లును, వారందరు నొకేయుద్దేశముతో పని చేయుచున్నట్లును, వివిధమండలములవా రొకరి నొకరెరుంగక పోయినను ఒకచోటనుండియే యాయుధములను సేకరించుకొనుచుండినట్లును తెలుచున్నది.

మాజనీజీవితమును వ్రాయుట; అందులో సావర్కారువ్రాసిన యుపోద్ఘాతము విప్లవమును స్పష్టముగా ప్రోత్సాహించుచున్నది.

7

ఆతడు యూరపులో జరిపిన చర్యలు:—దీనికి 1908 మే మొదలు 1909 ఫిబ్రవరివఱకును 'భారతగృహములో పనిచేసిన చతుర్భుజుడను వంటలవాడును, నొకయింజనీరింగు విద్యార్థియు, లండనులో సావర్కారుతో స్నేహము చేసినమరి యొకడును; సావర్కారువద్దగాని యతనిస్నేహితులవద్దగాని దొరకిన కాగితములును; అతడు వ్రాసిన కాగితములును సాక్ష్యములు. పైనచెప్పబడిన లండనుసాక్ష్యములలో దేనిని కూడ త్రోసిపుచ్చుటకు వీలులేదు. "భారతగృహము"లోని విప్లవపక్షమువారి కతడు నాయకుడని యవన్నియు ఋజువుచేయుచున్నవి. అతడు "భారతస్వాతంత్ర్యయుద్ధము" అని నామకరణమిడి 1857 లోనిభారతవిప్లవకారులచరిత్రను వ్రాసెను. ఆవిప్లవములో చనిపోయిన విప్లవకారుల నందఱ నభినందించుచు 'ఓదేశభక్తులారా' యను యుద్రేకమును రగుల్కొల్పుకరపత్రములను భారతదేశమునకు బంపెను. అతడును 'భారతగృహము' లోనివారును గలసి బాంబులను తయారుచేయు విధమునుగురించి పుస్తకములను బైపుకొట్టి భారతదేశమునకు బంపిరి. ఆత డభినవభారతసంఘమువారినుండి ప్రమాణములను గైకొనుచుండెడివాడు. ఈ సంఘమునకు శాఖలు ప్రపంచమంతటను కలవని యతడు చెప్పినట్లిద్దరు లండనుసాక్ష్యులు చెప్పుచున్నారు.

1908 లో ఆవంటబాపిహ్మణుడు భారతదేశమునకు పోవునపుడు సావర్కారతనికి 20 బ్రౌనింగుపిస్తోళ్ళను, కొన్ని తూటాలను తనపెట్టెలో దాచి తీసికొనిపోయి బొంబాయిలో నొకరి కిమ్మని బలవంతపరచెను. మరియొకసాక్షి 1910 లో భారతదేశమునకు పోవుచుండ నతడిట్లే బలవంతపెట్టెను. కాని యతడొప్పుకొనలేదు. చివరకొక్క పిస్తోలు నతనికి బలవంతముగా కట్టబెట్టెను.

చతుర్భుజున కిచ్చిన పిస్తోళ్ళను, బాంబునుగురించి వ్రాసిన ప్రతులున్న భారతదేశము చేరెను. గణేశసావర్కారుయింటిలో నాప్రతియొకటి దొరకెను. పారిసులోనున్న భారతరాజద్రోహసంఘముతో సావర్కారుకు సంబంధము కలదు. చంజేకిరావు నరెస్టుచేసినపు డతనివద్ద 'వందేమాతరం' ప్రతులు దొరకెను. కర్జనువిల్లీని చంపిన డింగ్రాను స్తుతించుచు నవి వ్రాయబడెను. వానిని సావర్కారే యాతనికిచ్చెను. ఆకర పత్రము రాజకీయహత్యలను ప్రోత్సహించుచుండెను. దాని నతడే వ్రాసినను వ్రాయకపోయినను భారతదేశములో నతడిట్టి ప్రచారమునే చేయుట కుత్సహించుచుండెను. "ఉద్యోగస్థులను చంపివేసెదమని భయపెట్టెను. దానితో నిరంకుశప్రభుత్వయంత్రమున కవసానకాల మాసన్నమగును. ఖుదీరాం బోసు, కనైలాల్ దత్తామొదలగు యోధులచే దేదీప్యమానముగా ప్రారంభింపబడిన యీపద్ధతినే నిరంతరము సాగించి

త్రిమేని భారతదేశములోని బ్రిటిషు ప్రభుత్వము త్వరలోనే యంతరింపగలదు. ప్రజలలో స్వదేశము నగుబాట్లున్నట్టు, పరిభుత్వమును నిర్వర్తించుటకును నిట్టి ప్రత్యేక ప్రత్యేకహత్యలే శ్రేయస్కరమైనవి. ఇవియే విప్లవమునకు ప్రథమసోపానము" అను నిట్టి ప్రబోధము లనేకము లందుం గలవు.

వినాయక దామోదరసావర్కారు:—"రాజద్రోహము నుగూర్చిన సమస్యలో వినాయకసావర్కారుచర్యల నేకములు చర్చింపబడెను గనుక నతనికేసును ప్రత్యేకముగా విస్తరించి చర్చించుటనవసరము. 'భారతగృహమున' కతడు యాజమాన్యమును వహించినరోజులలో భారతదేశమున పంచిపెట్ట బడిన యొక కరపత్రము నిచ్చట దాఖలుచేసెదము. దానిలోని విషయమును బట్టిచూడ నది లండనులో విప్లవకారుల యుత్సవములను జరిపిననాడు వ్రాసినట్లు కాన్పించును. ఈ కేసులో దాఖలుచేసినప్రతి కాశికరుగృహమును సోదాచేసినప్పుడు దొరకెను. దానిని మరియొకముద్దాయి వినాయకసావర్కారునొద్ద తీసికొని కాశికరు కిచ్చెను. అది బ్రిటిషు ప్రభుత్వముపై హోరాహోరీ యుద్ధమును ప్రకటించుచుండెను. అందులో నొకవాక్య మిట్లున్నది. "యుద్ధము 1857 వ వత్సరము 10 మే తేదీని ప్రారంభమయి 1908 మే 10 వ తేదీకింకను ముగియలేదు. మరియొక మే 10 వ తేదీ పరమావధిని చూచువర కును నీయుద్ధ మాగునదికాదు." దుర్బోధనలచేతను, యుద్ధ

మునకు పురికొల్పు నచ్చుప్రతులను పంచిపెట్టుటచేతను, ఆయుధములను సరఫరాచేయుటచేతను, ప్రేలుడుసామగ్రిని తయారుచేయువిధమును ప్రచారముచేయుటచేతను ముద్దాయి యుద్ధమును పురికొల్పుటచే దోషియని మేము తీర్మానించుచున్నాము. కనుక నతడు 121 సెక్షను (ఎ) ప్రకారము శిక్షార్హుడవు.

— తీర్పు. —

వినాయకదామోదరసావర్కారుకు:—కోర్టువారు నీపై యావజ్జీవ ద్వీపాంతరవాసమును; నీయావదాస్తిని ప్రభుత్వమువారు వశపరచుకొనునట్లును శిక్ష విధించుచున్నారు.

ఈశిక్ష చాలక సావర్కారుపై జాక్సను హత్యను ప్రోత్సహించెనను మరియొక నేరము తేబడెను. దీని కురిశిక్ష విధింపబడునని చాలమంది తలంచిరి. సావర్కారు రెంతమాత్రమును జంకక వెనుకటివలెనే భారతదేశములోని యాంగ్లాధిపత్యము నంగీకరింపజాలనని వాదించుచుండెను. హేగుసభలో యావత్ప్రపంచదృష్టిని సావర్కారాకర్షించుటచేతనో, మరే కారణముననో యురిశిక్షను మానివేసి న్యాయమూర్తు లతనిపై మరియొకసారి ఆశిక్షనే విధించిరి. "త్యాగము, కష్టసహిష్ణుత మాత్రమే నేడుగానిచో రేపైనను భారతమాతకు మోక్షసామ్రాజ్యమును జేకూర్పగలవను దృఢవిశ్వాసముతో మాధర్మశాస్త్రములు విధించు నెట్టిదారుణశిక్షనైన నతి

సంతోషముతో నాలింగనమొనర్చుటకు నేను సిద్ధముగ నున్నాను" అని సావర్కారు వచించి చేతులకు సంకెలలు తగిల్చి శస్త్రపాణులైన రక్షకభటు లతనిని కోట్టమునుంచియు ప్రపంచదృష్టినుంచియు దొలగించుచుండ దేశమాత నిట్లారాధించెను.

—("మొదటివాయిదా")—

"తల్లీ ! ఈ నీచిరుతబిడ్డల యల్పసేవ నంగీకరింప వేడుచున్నాను. తల్లీ ! నీఋణమును దీర్చుకొనుటకు మే మెంతటివారము !

నీవు మమ్మాశీర్వదించితివి ! మాకు స్తన్యమునిచ్చి ఘనుల నొనర్చితివి !

మే మీరోజున నీయజ్ఞకీలలలో ప్రవేశించుచున్నాము! నీఋణముయొక్క మొదటివాయిదాను చెల్లించితిమి ! మేము తిరుగ పునర్జన్మను దాల్చి యాకలిమంటచే హాహాకారముల నెత్తుచున్న యజ్ఞదేవత సంతృప్తినొంది నీకు జయము చేకూర్చువఱకు నిట్లే యాత్మార్పణమును జేయుచుందుము.

కాళిందీమర్దన కంసారి యైన శ్రీకృష్ణుడు నీవిజయసారథ్యమును వహించియుండ, దశరథరాముడు నాయకుడై యుండ, ముప్పదికోట్ల ముద్దుబిడ్డలు యోధులై నీధ్వజమున జేరి పోరుచుండ మేము హతులమైనను యీదివ్యచమూప్రవాహ మాగునది కాదు! తల్లీ! అది చరచర ముందుకు బో

వుచు దుష్టశక్తుల ననర్గళముగా నిర్జించి నీదివ్యదక్షిణహస్త
ముతో స్వతంత్ర్య, ధర్మపతాకమును విజయానేక లక్షిత
శీతనగశిఖరములందు స్థాపింపకున్నే !"

## —॥ అండమానురంగము, ॥—

సావర్కారుఅండమానుదీవులకు బంపబడెను; ఇవి బం
గాళాఖాతములో గంగాముఖమున కయిదువందల తొంబది
మైళ్ళదూరమున గొలుసులు గొలుసులుగానుండు ద్వీపస
మూహము. ఇవన్నియు గొండలతోను, మనుష్యులు చొర
రాని కీకారణ్యములతోను నిండియుండును. ఇచ్చట సంవత్స
రమున కెనిమిదిమాసములు హోరున వర్షించుచుండ మదగజ
సన్నిభములగు మేఘములు పై కెగయుచు, చిమ్మచీకటులతో
నాకసమును గప్పుచుండును. ఈగలు ఝుమ్మని మునురుచు
మనుష్యవాసన తగిలినచో వెంటనే వారిపై వ్రాలును. జల
గలు మహాఠెపుపొదుగునయుండి మనుష్యులను బీకుటకు సిద్ధ
ముగానుండును. దోమలకు మేరయే లేదు. అవిమనచిన్న
గొల్లభామలంతంత (grass hoppers) యుండి మలేరియాను
ప్రచారము చేయుచుండును. సముద్రపుటొడ్డున కుళ్ళిన ఆకు
లకుప్పలు పడియుండును. ఇచ్చటి యాదిమనివాసు లడవి
జాతివారు. దిగంబరులు. వారరణ్యములలోనే యుండి యప్పు
డప్పుడు పైకి వచ్చి మనుష్యు లెచ్చటనైనను బొడకట్టినచో
దమ యీటెలతో దూరమునుండియే, తాము గాన్పింప
కుండ గురితప్పకుండ పుల్లరెల నెగురవేయుచుందురు.

ప్రభుత్వమువారీ దీవులను మొట్టమొదట 1857 వ వత్సరములో దమపై తిరుగబడిన సిపాయీదారుల శిక్షకొరకు స్థాపించిరి. తరువాత 1863 లోను, 1870 లోను యీ ప్రదేశములను బాగుచేసి, యడవులను నరికించి కొంతవరకు వాసయోగ్యము గావించి మామూలు ఖయిదీలకు గూడ బంపుట కేర్పాటుల జేసిరి. ఇచ్చట సాధారణముగా 13000 మగఖయిదీలును 700 లేక 800 ఆడఖయిదీలును నుంచబడుదురు. నలువదిరోజుల కొకసారి భారతదేశమునుండి క్రొత్తఖయిదీల నిచ్చటకు దీసికొని వచ్చుచుండును. భారతదేశమునుండి ఖయిదీలు వచ్చుటతోడనే కారాగారద్వారమువద్ద ద్వారపాలకులు వారిని లెక్కపెట్టుచు వారివారి శిక్షలను, పరిమితిని దెలుపు చీటీలను వారిమెడలకు గట్టుదురు. గుమ్మము దాటుటతోడనే కారాగారాధికారి యెదుట వీరందరును వరుసగా నిలువవలెను. అప్పుడతడు డిల్లాక గంభీరోపన్యాసము నిచ్చును. "ఇదిగో! మీ రీజయిలుగోడలను జూచితిరా? అవి యంత యెత్తుగాలేవు. మీ రిచ్చటకును బారిపోవుటకు వీలులేదు. కనుకనే నవి యట్లున్నవి. ఎటుజూచినను 1000 మైళ్ళవఱకు సముద్రము దీని నావరించియున్నది. అడవులలో నడవిపందులు బావురుపిల్లులు దప్ప మరేక్రూరమృగములు లేకపోయినను నచ్చట 'జారావాలా' లను నడవిజాతివారున్నారు. వారికి మనుష్యవాసన తగిలినచో నెంతదూరమున నున్న

ను దమ యీాతెలకు బలిగొందురు. నన్ను చూచితిరా? నా పేరు బారీ. విధేయతతో బ్రవర్తించువారికి నేను సేవకుడను. అవిధేయులయెడ నేను దయాదాక్షిణ్యముల జూపజాలను. మీరు నేను చెప్పినట్లు నడచుకొనియెడల బ్రహ్మదేవు డడ్డుపడినను నేను మిమ్ము విడుచువాడను కాను. ఇది ముమ్మాటికిని సత్యము! ఈబ్లెర్ తీరమునకు మూడు మైళ్ళలోపల భగవంతునకు జోటులేదనుసంగతి జ్ఞప్తియం దుంచుకొనుడు!"

ఇట్టి యండమానుదీవులలో సావర్కారు పదునాలుగువత్సరము లరణ్యయజ్ఞాతవాసములను రెంటినిగూడ గడుపవలసివచ్చెను. సంవత్సరమున కొకసారి బంధుగుల కొక్కయుత్తరమును మాత్రమే యతడు వ్రాయవచ్చును. బంధుగులుగూడ నొక్కయుత్తరమును గొన్నిపుస్తకములను బంపవచ్చును. ఈయుప్పటిని కారాగారాధికారులు పరీక్షచేసిన తరువాతనే పంపుచుండురు. కొంతకాల మతని యారోగ్యము బాగుగనే యుండెను. అతడు తన విధులనన్నిటిని క్రమముతప్పక నెఱవేర్చుచుండెను. కాని సంవత్సరములకొలదిజయిలులో గుంపు మండుట; సూర్యరశ్మికూడకరవగుట; ప్రక్కనున్న సోదరునితోగూడ మాట్లాడుట కధికారము లేకపోవుట; కఠినమైన పనులను జేయుచుండుట; కడుపునుంటను జల్లార్పజాలని క్రిమికీటకములతోను, బంటిక్రింద పట పట లాడుచుగంద్రయిసుకరేణువులతోను గూడిన యుడికీ యుడకని పదార్థములను కండ్లుమూసుకొని బలవంతమున దిగమ్రిం

గు చుండుట; మహదాశయములు భంగమగుట; ఎప్పటికిని బంధవిమోచనము జేకూరకుండుట; మొదలగు దైహిక, మానసికవిచారము లంతకంతకు సావర్కారును కృంగదీయ జొచ్చెను. అతడు నానాటికి క్షీణించి, బరువుతగ్గుచు, శల్యమాత్రావశిష్టుడై, మృత్యువుతో బోరుచు 1921 వ వత్సరమున నొకనాడు మృత్యుశయ్యపై బవళించి యామె నిట్లాహ్వానించెను. "ఓమృత్యువా! రమ్ము! నీవిదివఱకే ప్రయాణోన్ముఖురాల వైతి వేని నీకాహ్వానము నిచ్చుచున్నాను. రమ్ము! నేటితో దమకాంతి నశించునని యీనేత్రకమలములు, యీ రసభరితద్రాక్షౌద్వయము భయపడిన భయపడునుగాక ! కాని నీవనిన నేను భయపడువాడనుగాను. నీకుద్రావనిచ్చుటకు నా కీయశ్రుజలకలశ మొక్కటిమాత్రమే కలదు ! నేనెంతద్రావినను నీపెన్నిధి యారిపోవునది కాదు! నీకిది సమ్మతమగునేని రమ్ము ! నీ వకాలములో వచ్చుచున్నను నేను నా ధర్మముల నెప్పటికప్పుడు నెఱవేర్చుకొనుచు నేయుంటిని. నా ఋణత్రయమును నేనిదివఱకే తీర్చుకొంటిని. ఇక విచారమేల ? నేను బ్రాణదాయియగు వేదవిద్యాప్రవాహమున గొన్ని గ్రుక్కలను ద్రాగితిని !

అపరాత్పరుని మనన, ధ్యాన, కీర్తనాదిరసానుభవమును గొంతకు గొంతయైన బడయగలిగితిని. పద్రెండు నిండువత్సరము లీభయంకరమృత్యుభూమియందు గఠినతపము నొనర్చితిని; ఇట్లు నాఋషిఋణమును దీర్చుకొంటిని. అ

పరాత్పరుని ధ్వజమున జేరి రణ భేరీ, శంఖ, దుందుభులను మ్రోయించి శ్రీరాముడు ప్రథమదిగ్విజయయాత్రను సాగింపగనే నేనతని సైన్యముల నడిపించితిని. నేటివఱకును నేనీప్రతాపాగ్నిచే తప్తుడనై నాదేవఋణమును దీర్చుకొంటిని. ఇప్పుడు నారక్తమాంసములును నెముకలునుగూడ నీయందమాను దిబ్బలపైదహనసంస్కారము గావింపబడి నాయౌవన మనుబుగ్గి మాత్రము మిగిలియున్నది. వంశము నశించిపోకుండ సంతానోత్పత్తిని గావించి పితౄణమును దీర్చుకొనవలెనను నార్యధర్మనిర్వహణమున కసమర్థుడనగుటచే నే నభినవభారతమునే (young Indian generation) నావారసునిగాను నాకుమారునిగాను దత్తతచేసికొనుచున్నాను. నాకు పుత్రికాపుత్రుల కఱవులేదు. నేత్రదళమును దెరచి శిశువోలికలో నుండి చూచు ప్రతికంటిలోనుండియు నీప్రపంచాద్భుతములను మరల నూతనముగా జూడవచ్చునది నేనే! ఇందీవరనిగ్గులకుదేలు యే బాలవదనసరోజమును జూచినను నాహృదయ మపార ప్రేమ, కరుణారసాతిరేకముల నుప్పొంగుచుండును. బుద్ధివైశద్యమును, నాశాంకురములును లలాటఫలకమున ముద్రితమై యుండు యౌవనావిర్భావము గాన్పించినపుడదినాచిన్ననాటి మహదాశయముల నన్నింటి నొక్కసారి రగుల్కొల్పి నాకు భారతభావిసంపత్కీర్తులం దమోఘవిశ్వాసమును బురికొల్పుచుండును. ఒక్కభారతజాతియే కాదు! మానవలోకమంతయు నట్లే కాగలదను విశ్వాసము నా కుదయించుచుండును. ఓయి

వకులారా! సుకుమారగాత్రులారా! మీరందఱును నా కుమారులే! మానవయువకులలో నేననవరతమును యౌవనుడనై పితృఋణమును దీర్చుకొనుచున్నాడను. మృత్యువా! నీవిక నీయిష్టమువచ్చినట్లు చేసికొనవచ్చును! నేనెన్నో నాఋషి దేవ, పితృఋణములను దీర్చుకొంటినని సమాధానపడితిని. నేటివిధులనుగూడ నేనప్పుడే నెఱవేర్చుకొంటిని. మన విధులెవ్వియో, మనము వాటిననర్గళముగా నిర్వర్తించుటెట్లో, మనమెప్పుడుదయింతుమో, యెప్పుడస్తమింపనున్నారమో తెలిసికొనుట దుర్లభమైనను, జ్ఞానులు మొదలగువారనేకు లీవిషయమై యనేక విరుద్ధాభిప్రాయముల వెలిబుచ్చినను, నే నేది మానవలోకాభివృద్ధికిని, మానవాత్మకళ్యాణమునకును తోడ్పడునని ఋషులును, పూతచరిత్రులును వచించిరో దానినే మనుష్యధర్మముగా స్వీకరించితిని. ఇట్టి మానవధర్మనిర్వహణములో నొక్కమనుష్యమాత్రు డెంతపని నిర్వహింపగలఁడో యంతపనిని గష్టపరంపరలను సహించి, నాకున్న పరిస్థితులనుగూడ ధిక్కరించి సాధించితిని. నాదీక్ష కాలకములను గల్పించు పిరికితనమునకు నేనెన్నఁడును జోటిచ్చియుండలేదు. కులీనత; అవ్యంగమైన శరీరసౌష్ఠవము; కంటికి రెప్పవలె గాపాడిపోషించిన జనకుడు; కరుణారసమూర్తియైన తల్లి; త్యాగ, కష్టసహిష్ణుతలకుసిద్ధియై ముందడుగువేయుచు దల్లికంటె నాప్యాయతను జూపు జ్యేష్ఠసోదరుఁడు; సమర్థుఁడు, వినమ్రుఁడు, భ్రాతృవత్సలపరాయణుఁడునైన కనిష్ఠసోదరు

ము; ఏయాదర్శమును లేనిచో గత హేయముగా బహుప్రాయ ముగా వెచ్చవేయుచున్నట్టి యీ స్వల్పప్రవాసజీవితమును సార్థ కముచేయుచు, "గాఢతర పాతకీ! తమున" కొంతవన్నె దెచ్చి స్థైర్యసాహసకలాపములచే నా శుద్ధశీలమును ప్రసాదించుచునుహా దాదర్శము మొదలగున వన్నియును నాకు ప్రసాదింపబడి నవి. జ్ఞానులు, పరమపవిత్రులు మొదలగు ఋషిపుంగవుల వంటివారితోగూడి ఆపరాత్పరుని పదకమలములను సేవించు భాగ్యముకొంత నాకబ్బినది. కీర్తికాంతనుగూడ గొంతవఱకు నేను జవిచూచితిని. నేననేకపవిత్రతోయములను పానము చేసితిని; నానాపుణ్యక్షేత్రములు, పుణ్యనదులు, పుణ్యవాయు వులు మొదలగువాటి సౌరభము నాఘ్రాణించితిని. ప్రజ్వలిత తాపసాగ్ని మొదలు ప్రియజనాశ్లేష సౌఖ్యానందము వఱకును జీవితములోని శీతోష్ణసమసుఖదుఃఖముల ననుభవించితిని. మృదుమధురవీణాశ్రుతి మొదలు మృత్యుసమ్ముఖమునకు బోవ పోరాడు శృతికఠోరమగు గురగురధ్వనివఱకు నాల కించితిని. స్త్రీలను, పురుషులను, దేశములను, జాతులను, ఖండములను, ఖండాంతరములను మొదలగు వివిధరంగముల నీ భూతలచిత్రప్రదర్శనశాలయందు తిరుగాడుచు గాంచి తిని. మృత్యువా! అట్టి నా యీ నేత్రద్వయము నొక్కసారి బుగ్గిచేసి నీమనోరథము నీడేర్చుకొనుము!

కాని నాయావనసౌభాగ్య మంతయు నడవినిగాచిన వెన్నెలచంద మాయెను!

ప్రేమామృతము నీపెదవులు చవిగొనుసంతనే దయాదాక్షిణ్యశూన్యమైన యాకట్టడివిధి నన్నిట్లీయండమానుదీవులకు విసర్జించెను. లేబ్రాయముసందే నేనిట్టి పరితాపాగ్నికి బాల్పడినను యతిరథమహారథులుగూడ సహింపజాలని దుస్సహసంతాపతాపమును భరింపగలిగితిని. ఈజీవిత పార్వణచంద్రచంద్రికాతరంగములలో హాసక్రీడలను సలుపవలెననెడు యౌవనోత్సాహ మింకను నాలో బూర్తిగానశింపలేదు! అయినను జీవితభాగ్యము నంతయు ఁడిసికొనుటకే సమర్పించిన యయాతిచక్రవర్తికిగూడ దృప్తికలుగకపోయెను! కోరికయను బీజమున కనుభవము లేక భోగమను ఫల ముదయించును. కాని, యీఫలములోనే తిరుగ మరియొక బీజము బుట్టుచు దీని కంతు లేకయున్నది. వేయిసారు లనుభవించినను మొట్టమొదటి భోగమే కాని నూతనాంశ మేదియును గానరాదు. కనుక నీయభిమతము ననుసరించియే నే నీ తుదిమాట ను వ్రాయుచున్నాను. "నాదినములను నే నెప్పుడును వ్యథపుచ్చలేదు. కనుక నవి యిప్పు డస్తమించినను నేను విచారింపను."

రేపటి విషయమును గురించికూడ నా కెట్టి విచారము ను లేదు. ఒకవేళ నేను తిరుగ బుట్టుట సంభవించునేని "మనమేవిత్తులను జల్లితిమో వానినే కోసికొందు" మను న్యాయముప్రకారమును "నీవు సంచరించినట్లే, నీవు సంచరించిన పరిస్థితులలోనే యితరులును సంచరించుచో మానవాభివృద్ధి

కెంతమాత్రము నాటంకము గలునగట్లు సంచరింపవలె" నను సిద్ధాంతమును నెట్టిఫలమును గోరకుండ నేను శైశవమునుండి యు జరిపితిని. "నీ స్వతరు లెట్లుచూడవలెనందునో యట్లే నీవును యితరులను జూడుము" అను పవిత్రాదేశముచే నేను శిరసావహించితిని. కేవలెప్పుడైన విధిలేక తీవ్ర, కఠిన పద్ధతులకు గడంగితినేని ధర్మదేవతాప్రేరితులమయియే నేనును నాతరమువారునుగూడ నిట్టి యసామాన్యపరిస్థితులకు బురికొల్పబడితిమి. నాజయిలుయావరణలో 10 అంగుల పచ్చికబయలు కలదు. నే నచ్చట విసువబడినపు డిటునటు తిరుగుచు కొంత పరిశ్రమను దీసికొనుచుండెడివాడను. నే నప్పుడు నాధ్యానములో నీవిశ్వసంతతితోను సంధానైక్యములను గ్రహించుచు నాకాలిక్రింద తలయెత్తి చల్లగాలికి సంతోషాతిరేకమున నృత్యముచేయుచున్న సుకుమారవరతృణవిశేషమునకు నొప్పి కలిగింపరా దనుభావముచే నొక యడుగైనను ముందుకు వేయజాలక స్థాణుప్రవతా పోవుచుండెడివాడను. ఒక్కొకపుడు నాతోడి భోజనమునకు కూర్చొనినపుడు వర్ణింపత ప్రపంచములో నన్ను నేను మఱచిపోవుచు "ప్ర ప్రాణియే కదా! ప్రతిప్రాణియు వృద్ధిపొందుచు ప లతోనుండ నుత్సహించుటలేదా? దాని నీవిధముగా చ వేయుట శిశుహంతతో సమానమైనదికాదా? ధాన్యపుగింజ

నైననుగోధుమగింజనైనను మరియొకఫలమునకు బీజముగు టలేదా?" అను భావములతో సన్నప్రశ్న నోట రాకుండ నాగిపోయెడిది! ఇట్టి విశ్వప్రేమతో, నిర్వ్యాజతతో నేను జేయబోవు ప్రతికార్యమును బరీక్షించుకొనుచు, సంసారంచములో నేజీవకోటికిని హానిచేయరా దనుసూత్రమును బాటించుట యసంభవ మనువిచారము బాధించుచుండ, నైతిక సత్యము లింతయస్థిరముగానుండ గాలిపీల్చుకొనుటే హింసయను శూలపుపోటు హృదయమును వ్రక్కలుచేయుచుండ, ప్రపంచధర్మమును మానవనీతిచే ననగాహనము చేకొన జూచుట దుర్లభ మనునిరాశ జనించుచుండెడిది. ఒక్కొక ప్పుడు నేనిట్టిభావముతో విచారగ్రస్తుడనై జడునిభంగి కలవరపడియుండెడివాడను. అయినను నే నట్లాచరించుటకే నాసర్వశక్తులను వినియోగించితిని. దీని నతిక్రమించునో నైతికనో, యజ్ఞానముచేతనో మాత్రమే నే నట్లు చేసితిని. కానిక నాకు కేపటివిషయమైకూడ నెట్టివిచారమును లేదు. ఈ నృత్యతీరమును దాటు టెంతకష్టమోకదా ! కాని యవి ల... లేని గట్టుననున్న పుణ్యపురుషులకును, గులీనుల ...గులకునుగూడ శ్రీకృష్ణభగవానుని రాయభార నేను గొంపోవుచున్నాను. "తమధర్మము నక ...మగా నిర్వహించినవారెన్నటికిని హతభాగ్యులు గా... ...ు." ఇది యెన్నటికిని బరమసత్యము! ప్రకృతివాదులై,

నిరీశ్వరమైన ధర్మసూత్రమును మాత్రమే విశ్వసించువారు కూడ దీనినే బలపఱచుచున్నారు.

కనుక స్వర్గనరకములు, చావుపుట్టుకలు, బంధమోక్షములు మొదలగునవి మనకర్మఫలములే యని వచించు వాక్కులే సత్యములగునెడల సదాచార, ధర్మసూత్రానుసారముగ నీలోకమందే తగినంత మూల్యము చెల్లింపబడుటచే మృత్యుకవాటము తెఱచి బహిర్గత మగుచున్నను నాయదృష్టనగరమునం దసమానసౌధరాజము లిదివఱకే నాకొఱకు ప్రత్యేకింపబడియున్నవి.

లేక స్వర్గనరకములు, బంధమోక్షములు, ఆత్మానాత్మలు, ధర్మాధర్మములు మొదలగున వన్నియు మనఃకల్పితములుమాత్రమే యగుచు, నాకాశసౌధము లగుచో, నాత్మకూడ యూహాజనక మగుచు నణువులును బరమాణువులును గలసిన యాధ్యాత్మిక, రసాయనిక వస్తుసమ్మేళనముమాత్రమే యగుచు దిరుగ విడిపోవు నందు నెడల నదియును శుభప్రదమేకదా! అప్పుడు మృత్యువు గాఢనిద్రయైనగావలెను! లేదా మోక్షమే కావలెను! ఈపంచభూతములు నీసమ్మేళనము నుండి విడివడి నూతనపరమాణువులు మరికొన్ని నూతనపరమాణువులతో గలసి మరియొక నూతనవస్తువు కావచ్చును; లేక శూన్యములో కలసిపోయి విస్మృతి జెందవచ్చును. బుద్ధి యనుగగనవీధి నొక్కసారి మెఱుపుతీగవలె ప్రకాశించిన యీ నాలోని "నేను" ప్రకృతిలోస్థగితమై, విశ్వాత్మకమైన "నేను"

లోఁగలసి మాయమగునేని మృత్యువా! అప్పుడు నీవు మోహదాయివే యగుచున్నావు ! కాని నా కొక్కటే కోరిక యున్నది. నీవు రాదలచుకొన్నచో వెంటనే తడవుసేయక రా గోరుచున్నాను! నిన్ను ప్రజలు ద్వేషించుటకును, నీ వపఖ్యాతి పాలగుటకును నీనైచ్యతగాని, నీనిర్దాక్షిణ్యతగాని కారణములు గావు! నిన్ను చూచివచ్చి నీనిజస్వరూపమును మాకెఱింగించినవా రెవరును నింతవఱకు గాన్పించ లేదు. కాని నీ యమాత్యశేఖరులగు శ్వాసకాసాదిరోగపరివారమే నీదుర్యశమునకు గారకులు. వా రంతకహారులు, అసహ్యస్వరూపులు; ఆతతాయులు. నేనొక్కడనే కాక యెట్టికోరికలును, యెట్టిద్వేషములను నెఱుగని శత్రుశూన్యుడైన యాబుద్ధదేవుడు గూడ నీపరివారమును ద్వేషింపకుండజాలడాయెను! "రోగము లేకుండుటకంటె మహదాశీర్వాద మేమియును లే" దని ధర్మపథము చాటుచున్నది. నీవు నీ నానారోగపరివారమునంతను నీపిలుపు నంగీకరింపక నీతో యుద్ధమునకుదలపడుయోధులపై బ్రయోగింపుము! నేనో! నాతలుపులను (నీకొఱకు బుద్ధిపూర్వకముగా తెరచి యుంచకపోయినను) నీవే బలవంతముగా బ్రద్దలుచేయుచుండుటచే దీసి నిన్ను మనఃపూర్వకముగా నాహ్వానించుచున్నాను! విజేతలమని విర్రవీగుచు, విఱుగబడువార లెల్లర పీచమడంచు నోయఖండైకవిజేతా! రమ్ము! ఇక నెట్టియుపోద్ఘాతములు నక్కర లేకుండ తత్క్షణమే రమ్ము!"



| మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPCA118B171 |
| పుస్తకం పేరు | వినయక సావర్కరు |
| తారీఖు | 29-10-24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 119 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | II, IV |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Sowmya |
| పేజీలు విడదీసినది | Sowmya |
| స్కాన్ చేసినది | Aswini |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |